## వర్షలగ్న జగల్లగ్న ఫలితాంశములు

| | | | |
|---|---|---|---|
| చంద్ర రవి (శుక్ర) | బుధ కుజ లగ్నం | | |
| కేతు | వర్ష లగ్నం | | |
| | 28-03-2017 ఉ॥ 08-26 | | రాహు |
| శని | | | (గురు) |

| | | | |
|---|---|---|---|
| (శుక్ర ) | రవి (బుధ) | కుజ | |
| కేతు | జగల్లగ్నం | | |
| లగ్నం | 13-04-2017 రా॥ 02-04 | | రాహు |
| (శని) | | చంద్ర | (గురు) |

**శ్రీ హేమలంబ నామ సంవత్సరం వర్షలగ్నం మేషలగ్నం, అధిపతి కుజుడు. జగల్లగ్నం మకర లగ్నం, అధిపతి శని.**

**వర్షలగ్నమును** పరిశీలించగా లగ్న అష్టమాధిపతి బుధునితో కలిసి లగ్నమందుండి చతుర్థ, సప్తమ, అష్టమ స్థానములను వీక్షించుట, ద్వితీయ సప్తమాధిపతి వక్రించి వ్యయమందు రవిచంద్రులతో కలిసి షష్ఠమ స్థానమును వీక్షించుట, తృతీయ షష్ఠమాధిపతి కుజునితో కలిసి లగ్నమందుండి సప్తమ స్థానమును వీక్షించుట, చతుర్థ పంచమాధిపతులిద్దరూ వ్యయమందుండి షష్ఠమ స్థానమును వీక్షించుట, భాగ్య వ్యయాధిపతి షష్ఠమమందు వక్రించి ద్వితీయ, దశమ, వ్యయస్థానములను వీక్షించుట, దశమ, లాభాధిపతి భాగ్యస్థానమందుండి తృతీయ, షష్ఠమ, లాభ స్థానములను వీక్షించుట, రుచక, సునభ, గజకేసరి,సంచార, ద్విగ్రహ, త్రిగ్రహాది **యోగముల వలన**

దేశపాలకులు దేశ అభివృద్ధినికాంక్షిస్తూ కొన్ని ప్రత్యేక చర్యలు చేయుట, తద్వారా అంతఃశత్రువులు, స్వపక్షపోరులు పాలకవర్గంవారికి అధికమగుట, ఆర్థిక వ్యవస్థలో అధిక సమస్యలను ఎదుర్కోవలసివచ్చుట, ప్రతిపక్ష వివాదములు అధికమగుట, రహదారులయందు ప్రమాదములు ఏర్పడుట, మతవాదములు ప్రబలుట, బ్యాంక్ వాటాలు, పన్నుశాతపు విలువలు పెరుగుట, న్యాయస్థాన వివాదములు అధికమగుట, ఆర్థికపరమైన విద్యాపరమైన, నిర్మాణ పరమైన కుంభకోణములు బయటపడుట, కళాకారులకు, పండితులకు, కవులకు, నటులకు అవమానములు ఏర్పడుట, వైమానిక పరంగా అభివృద్ధిచెందుట, జాతీయధనముతో దేశఅభివృద్ధికై చేయుపనులలో సత్వర ఫలితము కనబడకపోవుట, స్త్రీలకు ప్రత్యేక గుర్తింపులు ఏర్పడుట, నావికాదళం వారికి అనుకోని సమస్యలు ఏర్పడినప్పటికీ వాటిని తిప్పికొట్టుట, నిర్మాణాది పనులకై ధనవ్యయం అధికమగుట, రాజకీయ ప్రాముఖ్యత కల ప్రముఖ నాయకులకు ఇబ్బందులు వాటిల్లుట, మత సంబంధమైన వివాదములు తగ్గుముఖం పట్టుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట జరుగును.

www.granthanidhi.blogspot.in

**జగలగ్నమును** పరిశీలించగా లగ్న ద్వితీయాధిపతి వ్యయమందుండి ద్వితీయ, షష్ఠమ, నవమ స్థానములను వీక్షించుట, తృతీయ వ్యయాధిపతి భాగ్యస్థానమందు వక్రించి లగ్న, తృతీయ, పంచమ స్థానములను వీక్షించుట, చతుర్థ, లాభాధిపతి పంచమ మందుండి అష్టమ, లాభ, వ్యయస్థానములను వీక్షించుట, పంచమ, దశమాధిపతి తృతీయమందు వక్రించి భాగ్యస్థానమును వీక్షించుట, షష్ఠమ, భాగ్యాధిపతి చతుర్థమందు వక్రించి దశమ స్థానమును వీక్షించుట, సప్తమాధిపతి దశమస్థానమందుండి చతుర్థమును వీక్షించుట, అష్టమాధిపతి చతుర్థమందుండి దశమమును వీక్షించుట, అనభ, పర్వత, ధన, ద్విగ్రహాది **యోగముల వలన**

పాలక పక్షం వారికి ప్రతినిత్యం ప్రతిపక్షం వారిద్వారా ఇబ్బందులు ఏర్పడుట, ఐననూ ప్రభుత్వం చాకచక్యంతో ముందుకు వెళ్లుట, విదేశ వివాదములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, ప్రభుత్వం చేయు విధానముల ద్వారా ఉత్తమ ఫలితములు ఏర్పడుట, రక్షణశాఖ వారి కోసమై అధిక ధనము వెచ్చించవలసి వచ్చుట, ప్రముఖ దేశములకు భారతదేశము మార్గదర్శకముగా ఉండుట, కాశ్మీర్, నాగాలాండ్, మెజోరాం, మణిపూర్, మేఘాలయ, బీహార్ మొదలగు ప్రదేశములయందు పటిష్టమైన రక్షణ ఏర్పరచవలసి వచ్చుట, ఈశాన్య సరిహద్దు ప్రాంతములయందు ఇబ్బందులు వాటిల్లుట, శతృదేశములవారు దొంగచాటుగా ఉపద్రవములు కల్పించుట, ప్రభుత్వం చొరవ వలన ధరలు తగ్గుముఖం పట్టుట, నిరుద్యోగ సమస్యలు తగ్గుముఖం పట్టుట, యువతకు క్రొత్తక్రొత్త ఆదాయ వనరులు ఏర్పడుట, బ్యాంకు లావాదేవీలలో మార్పు వచ్చి సామాన్యుడికి వడ్డీభారము తగ్గుట, చిన్నతరహా పరిశ్రమలకు మంచి గుర్తింపు వచ్చుట, అంతరిక్ష పరిశోధకులకు, రక్షణ శాఖవారికి, మేనేజ్‌మెంట్ నిపుణులకు గర్వించదగ్గ గుర్తింపులు వచ్చుట, రోగసంబంధమైన భయములు తొలగిపోవుట, వైద్యాలయములు, సరిఅయిన వైద్యులు ప్రజలకు అందుబాటులో ఉండుట, న్యాయవ్యవస్థలో మార్పులు ఏర్పడుట, చిన్న రాష్ట్రముల పాలనలో అభివృద్ధి ఏర్పడుట, నైఋతి, దక్షిణ ప్రాంతములయందు అగ్ని సంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట, క్రీడారంగములో మంచి అభివృద్ధి ఏర్పడుట, ప్రయివేట్ రంగములో మార్పులు ఏర్పడుట, దేవాలయములు ఆర్థిక పరమైన అభివృద్ధి చెంది భక్తులకు విశేషమైన వసతులు ఏర్పరుచుట జరుగును.

కావున ప్రతిఒక్కరు ప్రతి గ్రామమందు గోవులను సేవించుట, వృక్ష సేవ చేయుట, సహస్రలింగార్చనలు, రుద్రయాగములు చేయుట, పండితులను, గురువులను, దైవజ్ఞులను సత్కరించుట, బీదలకు ఎరుపు వస్త్రాలు దానం చేయటం వలన దేశమునందు శుభములు చేకూరును.

**- దైవానుగ్రహ సిద్ధిరస్తు -**

**- మంగళం మహత్ - శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ -**

www.granthanidhi.blogspot.in

## అబ్ద ఫలనిరూపణం

### శ్రీ హేమలంబ నామ సంవత్సరం

శ్లో॥ **ధరామరాగోకుల రాజబృందాధర్మ ప్రసక్తా ఖలు హేమలంబే !**
**సీదంతి సర్వే విరలార్ఘ సస్యైరవృష్టిభిః క్షుద్భయ పీడితాశ్చ !!**

శ్లో॥ **హేమలంబో నృపాస్సర్వే పరస్పర విరోధినః !**
**ప్రజాపీడాత్వనర్ఘస్యాత్ తథాపి సుఖినో జనాః !!**

శ్రీ హేమలంబ నామ సంవత్సరమున రాజులు ప్రజలను సక్రమముగా పరిపాలించెదరు, కానీ కొన్నిచోట్ల రాజులు పరస్పర విరోధులగుట, చోరులు, దుర్మార్గులు ప్రబలుట, ధాన్యాదుల ధరలు హెచ్చుతగ్గులగుట, సామాన్య వర్షములు, ఉరుములు మెరుములు, వేడిగాలులు అధికము, బంగారము, ఆభరణములు ధరలధికమగును.

### వత్సరారంభ భౌమ వార ఫలం

శ్లో॥ **భౌమే నృపే వహ్నిభయం జనక్షయం చౌరాకులం పార్థివ విగ్రహంచ !**
**దుఃఖం ప్రజావ్యాధి వియోగ పీడా స్వల్పం వయోముంచతి వారివాహః !!**

శ్రీ హేమలంబ నామ సంవత్సరారంభము మంగళవారం అగుట వలన అగ్ని భయము, జనక్షయము, కర్మాగారములు వృద్ధి చెందుట, పరిశ్రమలకు అభివృద్ధి చేకూరుట, ఖగోళ పరిశోధనలు విజయము చేకూరుట, రక్షణ శాఖకు, వైద్యశాఖకు మంచి గుర్తింపులు వచ్చుట, కొన్ని ప్రాంతముల యందు వ్యాధిభయము ప్రబలుట జరుగును.

### బార్హస్పత్యమానేన శ్రీ సాధారణ నామ సంవత్సరం

శ్లో॥ **జలవృష్టికరాః పయోధరాః పశువృద్ధిః సుఖినోఖిలానరాః !**
**క్షితిపాః నిరతా నమత్సరే నతి సాధారణ నామ్ని వత్సరే !!**

సాధారణ నామ సంవత్సరములో పాడిపంటలు బాగుగా పండుట, జలము వృద్ధిగా నుండుట, దైవపూజలయందు ఆసక్తి పెరుగుట జరుగును.

### గురూదయ వశాత్ చైత్రాబ్ద ఫలం

శ్లో॥ **చైత్రాబ్దే భూమిపాః స్వస్థాక్షోణీచాల్పఫలప్రద !**
**సుదుర్లభంచోత్తమాన్నం ప్రీతాః సాధు జనస్యచ !!**

చైత్రాబ్దమున సామాన్య వర్షములు, సస్యములు మధ్యమముగా ఫలించుట, కోశాగార, ధాన్యాగారములు వృద్ధిలో ఉండుట, సాధువులకు అభివృద్ధితో పాటు అపవాదులు ఏర్పడుట జరుగును.

పంచవర్షాత్మకమగు యుగము(చక్రం)లో పితృఆధిపత్యమైన 7వ యుగము (చక్రము) నందు సంవత్సర నామక వత్సర ప్రీతికై **అగ్నిని ఆరాధించుట, పౌష్టికమైన యాగములు,** ధాన్యము, వెండి, రాగి, ఎరుపు వస్త్రములు దానముచేయుట, దేవాలయములను, నిర్మించుట, పోషించుట, **అన్నదానములు చేయుట,** వృక్షములను పెంచుట, **గురువులను, దైవజ్ఞులను, సత్కరించుట** వలన శుభములు చేకూరును.

## శ్రీ హేమలంబ నామ సం॥ నాయక ఉపనాయక నిర్ణయః

| | | | | |
|---|---|---|---|---|
| వత్సరారంభం | **రాజ్ఞః** | రాష్ట్రాధిపః | శుభాధిపః | **కుజ** |
| మేష సంక్రమణం | **మంత్రిః** | దేశోద్యోగాధిపః | అశ్వాధిపః | **శుక్ర** |
| వృషభ సంక్రమణం | | పురోహితః | గజాధిపః | **రవి** |
| మిథున సంక్రమణం | **అర్ఘాధిపః** | పశూనామధిపః | | **గురు** |
| కర్కాటక సంక్రమణం | **సస్యాధిపః** | దేవాదయాధిపః | | **రవి** |
| సింహ సంక్రమణం | **సేనాధిపః** | పురుషాధిపః | | **బుధ** |
| కన్య సంక్రమణం | | పరీక్షకః | గ్రామనాయకః | **శని** |
| తుల సంక్రమణం | **రసాధిపః** | వస్త్రాధిపః | | **కుజ** |
| వృశ్చిక సంక్రమణం | | గ్రామపాలకః | రత్నాధిపః | **గురు** |
| ధను స్సంక్రమణం | **ధాన్యాధిపః** | వృక్షాధిపః | | **శని** |
| మకర సంక్రమణం | **నీరసాధిపః** | జంగమాధిపః | | **రవి** |
| కుంభ సంక్రమణం | | గణకః | సర్పాధిపః | **చంద్ర** |
| మీన సంక్రమణం | | దైవజ్ఞః | మృగాధిపః | **బుధ** |
| ఆర్ద్రా ప్రవేశం | **మేఘాధిపః** | స్త్రీణామధిపః | | **గురు** |
| కుంభాయనం | | | వర్షాధిపః | **శుక్ర** |
| మీనాయనం | | | తటాకాధిపః | **రవి** |

**నాయక, ఉపనాయకులు 32 మందిలో 16 మంది శుభులు, 16 మంది అశుభులు.**

**శుభాశుభం సమముగా ఉన్నది.**

## దేశఫల నిర్ణయం

**శ్లో॥** కాంభోజ కాశ్మీర కళింగ దేశే రాజ్ఞ ఫలం । బాహ్లిక మాళవేషు మంత్ర్యుద్భవం ।
పౌండ్ర విధర్భదేశే సస్యాధినాథస్య ఫలంతు శిష్టం ।
చీనాంగ వంగదేశేషు రసాధిఫలం జగుః ।
గౌడమాగధ దేశేషు నీరసాధిపతేః ఫలం । **ఆంధ్రదేశేషు** సర్వేషు ఫలమార్ద్రాదిజం భవేత్ ।
మేషరాశిఫలం మత్స్యే గౌడే శేషంతు సర్వతః ।
పురోహితోద్భవం వంగేష్వంగేషు చ పరిక్షకమ్ ।
కైరాతదేశే గణకాత్ కృకరే గ్రామపాలకమ్ ।
దైవజ్ఞాద్భర్బరేదేశే కాశ్మీరే మేషసంక్రమాత్ ॥
**సంవత్సరఫలంశృత్వా** యస్సాంవత్సరికోత్తమమ్ ।
సంతోషయతి తేనైవ తోషితాస్సకలా గ్రహాః ॥

www.granthanidhi.blogspot.in

# రాజాధి నవనాయక ఫలములు

## రాజా కుజ ః

శ్లో॥ **భౌమస్య రాజ్యేగ్నిభయం ధరిత్రీ సస్యేనహీనా క్వచిదేవవృష్టిః !**
**చోరాః ప్రభూతా మనుజేశ్వరాణాం స్యాద్విగ్రహోన్యోన్య జయాయనూనం !!**

కుజుడు రాజు అగుట వలన అగ్నిభయములు ఏర్పడుట, రాజులు పరస్పరముగా విజయమునకై తీవ్ర ప్రయత్నములు చేయుట, ఎర్రని వస్తువులు, ఎర్రని రంగులు, కందులు, మిర్చి, పగడములు, బెల్లం, మత్తుపదార్థములు, విషవస్తువులు, రసాయనిక పదార్థములు, ఎరువులు, కలప, యంత్రపరికరములు, చమురు, ఉల్లి, పొగాకు, తేయాకు, కాఫీగింజలు, బంగారం, రాగి, వెండి, సిమెంట్, కంకర, భూమి ధరలు పెరుగును.

## వాహన ఫలము

శ్లో॥ **జనానాం భ్రమితే సర్వే చతుష్పాదాః ప్రపీడితాః !**
**విఫలా సకలాధాత్రీ నౌకావాహన వత్సరే !!**

రాజు నౌకావాహనారూఢుడగుటచే సముద్ర భయోత్పాతములు ఏర్పడుట, రవాణా లో ఇబ్బందులు ఏర్పడుట, వాహన ప్రమాదములు ఏర్పడుట, ధరలధికమగుట జరుగును.

## మంత్రి శుక్రః

శ్లో॥ **స్త్రీ పుంసోర్వి సదా ప్రీతిః ఫలితా సస్యజాతయః !**
**భవంతిగావః సుదుఘాః భృగుపుత్రేతు మంత్రిణి !!**

శుక్రుడు మంత్రి అగుట వలన స్త్రీ పురుషులు పరస్పరం అన్యోన్యత్వముతో ఉండుట, పాడి పంటలు వృద్ధిచెందుట, ప్రజలు ధర్మ కార్యముల యందు, దైవ కార్యముల యందు ఆసక్తి కలిగి ఉండుట జరుగును.

## సైన్యాధిపతి బుధః

శ్లో॥ **వాతాహతా వారిధరా కదాచిద్వర్షంతి సస్యాని తథా ఫలంతి !**
**లోకాస్సదా పీడిత కామచారాః సైన్యాధిపత్యే ఖలు చంద్రజస్య !!**

బుధుడు సైన్యాధిపతి (రక్షణశాఖకు) అధిపతి అగుటవలన వాయుపీడితమైన వర్షములు పడుట, కొన్నిచోట్ల మంచి వర్షములు కురియుట, పాడి పంటలు బాగుగా ఫలించుట, స్త్రీపురుషులు కామాసక్తత చెందిఉండుట జరుగును.

## సస్యాధిపతి రవిః

శ్లో॥ **సస్యాధీశే భాస్వతి విరళానిచ సర్వ సస్యాని !**
**అతి విపులం త్వీతిభయం కుళుత్థ చణకాది వృద్ధిస్యాత్ !!**

రవి సస్యాధిపతి అగుట వలన ఈతి బాధలచే కీటకబాధలచే మొదటి పంట నష్టము వాటిల్లిననూ రెండవ పంట లాభించుట, సస్యములు బాగుగా పండుట, ఉలవలు, శనగలు బాగుగా ఫలించుట, కందులు, వేరుశనగ పంటలకు ధరలు తగ్గుట జరుగును.

www.granthanidhi.blogspot.in

**ధాన్యాధిపతి శనిః**

శ్లో॥ కృష్ణధాన్యాని సర్వాణి సూక్ష్మధాన్యాని యానిచ !
కృష్ణ భూమిస్సుఫలితా ధాన్యాధీశే శనైశ్చరే !!

శని ధాన్యాధిపతి అగుట వలన నల్లని ధాన్యములు, సూక్ష్మ ధాన్యములు బాగుగా పండుట, నల్లని భూములు బాగుగా ఫలించుట జరుగును.

**అర్ఘాధిపతి గురుః**

శ్లో॥ సువృష్టిభిర్ధాన్యధనైర్విరాజితా భూమిః మహాయజ్ఞ పరైర్మహీసురైః !
నిత్యోత్సవైర్మంగళతూర్యనిస్వనైరర్ఘాధిపే దేవగురౌచ శశ్వత్ !!

గురుడు అర్ఘాధిపతి అగుట వలన ధనధాన్యములు వృద్ధిచెందుట, సువృష్టులు కురియుట, యజ్ఞాది క్రతువులు అధికముగా జరుగుట, ఉత్సవాదులు, శుభకార్య క్రమములు అధికముగా జరుగుట, పండితులకు గుర్తింపు వచ్చుట జరుగును.

**మేఘాధిపతి గురుః**

శ్లో॥ సస్యార్ఘ వృద్ధిభిస్తుష్టా భవేద్ధాత్రీ నిరంతరం !
వీతరోగ భయాస్సర్వే మేఘాధీశే బృహస్పతౌ !!

గురుడు మేఘాధిపతి అగుట వలన వర్షములు బాగుగా కురియుట, పంటలుబాగుగా పండుట, కొన్నిచోట్ల ధరలు తగ్గుట, మరికొన్నిచోట్ల విపరీతముగా పెరుగుట, రోగబాధలు ఏర్పడిననూ రోగనివృత్తి జరిగి పశుసంపద వృద్ధిచెందుట జరుగును.

**రసాధిపతి కుజః**

శ్లో॥ జీరకా లవణం సర్పి స్తిల తైల గుడాదయః !
శూన్యార్ఘం యాంతితే సర్వే భౌమే యది రసాధిపే !!

కుజుడు రసాధిపతి అగుట వలన జీలకర్ర, ఉప్పు, నెయ్యి, నూనె, బెల్లం ధరలు తగ్గుముఖం పట్టుట జరుగును.

**నీరసాధిపతి రవిః**

శ్లో॥ నీరసాధిపతౌ సూర్యే తామ్ర చందనయోరపి !
రక్తమాణిక్య యుక్తానాం జాయతే వృద్ధిరుత్తమా !!

రవి నీరసాధిపతి అగుట వలన మాణిక్యములకు, బంగారం, వెండి, రత్నములు, వాహనములకు ధరలధికమగును.

**దైవజ్ఞ బుధః**

శ్లో॥ దైవజ్ఞే చంద్రసుతే దైవజ్ఞా స్సర్వ శాస్త్ర తత్వజ్ఞాః !
సమ్యగ్విచార్య సకలం వదంతి పృథ్వీభృతాం నిత్యం !!

బుధుడు దైవజ్ఞుడు అగుట వలన దైవజ్ఞులు శాస్త్రములను బాగుగా పరిశీలించి సత్యమును తెలిపెదరు, దైవజ్ఞుల మధ్య వాదోపవాదములు అధికమగును.

**పశుపాలకః యమః**

శ్లో॥ అనర్ఘశ్చాల్పవృష్టిశ్చ స్వల్పక్షీరం తథాగవాం !
పశుపీడా భవేన్నిత్యం యమేతు పశునాయకే !!

పశుపాలకత్వం యముడికి వచ్చుట వలన పశువులకు అనారోగ్యములు వచ్చుట, దేశీయ పశుసంపద ప్రాణభయములు ఏర్పడుట జరుగును.

**గోష్టప్రాపకః గోష్ట బహిష్కర్తా శ్రీకృష్ణః**

శ్లో॥ బహుక్షీర ప్రదాగావస్సర్వే వ్యాధి వివర్జితా !
గోష్టాద్బహిః ప్రాపణంతు శ్రీకృష్ణేన కృతం తదా !!

గోష్టప్రాపక,గోష్టబహిష్కర్తాధిపత్యములు శ్రీకృష్ణనికి వచ్చుట వలన స్వదేశీ పశుసంపదకు అనారోగ్యములు తగ్గుముఖం పట్టుట,పశు సంపద వృద్ధిచెందుట జరుగును.

**వరుణ నామాకో మేఘః తత్ఫలం**

శ్లో॥ వారుణో నామ మోఘోసౌ సముద్రాంతం ప్రవర్షతి !
మహాఘోరం మహాఘాతం వర్షం వాయుసమన్వితం !!

మంచి వర్షములు కురియును, కానీ తూర్పు, ఆగ్నేయ ప్రాంతముల యందు తుఫాన్ గాలులు వీచుట, సముద్ర తీర ప్రాంతములయందు ఇబ్బందులేర్పడుట, వాయు సహిత వర్షములు ఉండును.

**ఆఢక నిర్ణయము**

శ్లో॥ షష్టియోజన విస్తీర్ణం శతయోజనమున్నతం !
ఆఢకస్య ప్రమాణంతు దేవమానేన గణ్యతే !!

విభాగం ః- శ్లో॥ దశ భాగాస్సముద్రేషు పర్వతేషు తథానవ !!
ధరణ్యామేకభాగస్స్యాదేవం వర్షతి చ త్రిథ !!

దేవమానముచే కొలుచు పాత్ర 60 యోజనముల విస్తీర్ణం, 100 యోజనముల ఎత్తు కలిగి 10 భాగములు సముద్రమందు, 9 భాగములు పర్వతములయందు, 1భాగము భూమి యందు వర్షం కురుయుట జరుగును. 2 తూముల వర్షం, 4 తూముల గాలి, 9 వీసముల పంట కలుగును.

**భూ వాహక విరాట నామ శేషః తత్ఫలం**

శ్లో॥ భూమిం వహే విరాటేతు భూమిస్వస్థా సుభిక్షకృత్ !
ప్రజానాం సుఖమారోగ్యం సువృష్టిః సర్వ దిక్షుచ !

విరాటుడు భూవాహకుడు అగుట సుభిక్షములు, సువృష్టి కలుగును.

**సముద్ర రోహిణి చక్రం - తట స్థానం తత్ఫలం**

శ్లో॥ యజి విధి ధిష్ణ్యం పతతి తటస్థం !
శుభజల వృష్టిః ధనకణవృద్ధిః !!

రోహిణి తటస్థానమందు వసించుట వలన శుభప్రదము, సువృష్టులు, ధన ధాన్య వృద్ధి, పశువృద్ధి కలుగును.

www.granthanidhi.blogspot.in

## గురు సంచార ఫలం

శ్లో॥ యదా కన్యాగతే జీవే హృష్టాః పుష్టాః ధరాసురాః !
అధ్వరే నిరతాస్సర్వే సదాస్వస్థాః క్షితీశ్వరాః !!

శ్లో॥ జీవే తులా గతే సర్వం ధాతుమూలా కులం జగత్ !
తథాపి ధాత్రీ సంకీర్ణా ధనధాన్య సువృష్టిభిః !!

గురుడు కన్య, తుల రాశుల యందు సంచారము చేయుట వలన పాలకులకు వర్గపోరులధికమగుట, నిరుద్యోగ సమస్య అధికమగుట, పంటలు సమృద్ధిగా పండుట, యజ్ఞయాగాదులయందు ఆసక్తి అధికమగుట, భక్తి భావము పెరుగుట, పండితుల మధ్య వివాదములు ప్రబలుట జరుగును.

## శని సంచార ఫలం

శ్లో॥ ఇనసూనుగతాద్రాశేః త్రిషడాయగతే గురౌ !
వింధ్యాద్రి లంకయోర్మధ్యే పతంతి శవకోటయః !

శ్లో॥ ధనూరాశి స్థితే మందే భూపానాం మహోపద్రవః !
జనానాం వ్యాధిపీడా చక్షుఃపీడా శస్త్రబాధతః !!

శ్లో॥ ఐంద్రాది త్రితయే వక్రం కరోతి రవినందనః !
రాజ్యాధీశ మృతిం కుర్యాత్ ఋతుత్రయే !

శని ధనస్సు రాశి యందు, వక్రించి వృశ్చిక రాశియందు సంచారము చేయుట వలన, శనికి పదకొండవ రాశిలో గురుడు ఉండుట వలన లంక మొదలుగా వింధ్య పర్వత ప్రాంతము వరకూ గల మధ్య ప్రాంతములో భారీగా జన నష్టములు, అగ్ని ప్రమాదములు ఏర్పడుట, కాశ్మీర ప్రాంతములయందు, సరిహద్దు ప్రాంతముల యందు, రక్షకభటులకు, రాజపురోహితులకు, ప్రభుత్వ అధికారులకు బెడదలు అధికమగుట, రోగ భయములధికమగుట, అకాలమరణములు, పశ్చిమ, ఉత్తరఈశాన్య ప్రాంతముల యందు కలహములు, కల్లోలములధికమగుట, ప్రముఖులైన పాలకులు అకాల మరణములు పొందుట, సురాష్ట్రం, అగర్తల ప్రాంతముల యందు ప్రాణ నష్టములు వాటిల్లును.

**Consult Me For ..**

New york,Techwon,Los Angeles,
Chicago,London,Mexico...etc International any Places
Tithi, Nakshatra,Varjya, Marriages & all the Good Timings

**AP ENDOWMENTS AGAMA ADVISOR, KANCHI PETHA PANCHANGAKARTHA**
**Brahma Sri.DAIVAGNA L. SUBRAHMANYA SIDDHANTHY**
**WWW.SIDHANTHI.COM**
**e-mail:** lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com
**9963732303, 9550017546, 9866839560**.

www.granthanidhi.blogspot.in

# వాస్తుకర్తరి, మౌఢ్య, పుష్కర, నిర్ణయములు

## వాస్తుకర్తరి నిర్ణయము

ఈ సంవత్సరం వైశాఖ శు॥ ౯ నవమి గురువారం దివి.04-05-2017 న మ॥ 02-38 ని॥లకు వాస్తు కర్తరి(డొల్లు కర్తరి) ప్రారంభం.

దివి.11-05-2017 గురువారం మ॥ 12-02 ని॥లకు నిజ కర్తరి ప్రారంభం.

దివి.28-05-2017 ఆదివారం రా॥07-33 ని॥లకు వాస్తుకర్తరి సమాప్తం.

## శుక్ర మౌఢ్య నిర్ణయం

శ్రీ దుర్ముఖ నామ సం॥ ఫాల్గుణ బ॥ ౭ సప్తమి తత్కాల అష్టమి సోమవారం దివి. 20-03-2017 న సా॥05-02 ని॥లకు పశ్చాదస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.

ఈ సంవత్సరం చైత్ర శు॥ ౪ చవితి తత్కాల పంచమి శుక్రవారం దివి. 31-03-2017న రా॥01-08 ని॥లకు ప్రాక్ ఉదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.

**తిరిగి మరలా**

ఈ సంవత్సరం మార్గశిర శు॥ ౯ నవమి తత్కాల దశమి మంగళవారం దివి. 28-11-2017 న రా॥12-30 ని॥లకు ప్రాగస్తమిత శుక్రమౌఢ్యమి ప్రారంభం.

ఈ సంవత్సరం ఫాల్గుణ శు॥ ౪ చవితి సోమవారం దివి. 19-02-2018న రా॥తె॥04-27 ని॥లకు పశ్చాదుదయ శుక్రమౌఢ్యమి సమాప్తం.

## గురు మౌఢ్య నిర్ణయం

ఈ సంవత్సరం ఆశ్వీయుజ బ॥౭ సప్తమి తత్కాల అష్టమి గురువారం దివి. 12-10-2017 న రా॥ 07-39 ని॥లకు పశ్చాదస్తమిత గురుమౌఢ్యమి ప్రారంభం.

ఈ సంవత్సరం కార్తీక బ॥ ౬ షష్ఠి తత్కాల సప్తమి గురువారం దివి. 09-11-2017న రా॥12-43 ని॥లకు ప్రాక్ ఉదయ గురుమౌఢ్యమి సమాప్తం.

**పై మౌఢ్యములయందు శుభకార్యక్రమములు వర్జనీయము. కావున చేయకూడదు.**

## పుష్కర నిర్ణయం

శ్రీ హేమలంబ నామ సంవత్సర భాద్రపద బ॥ ౭ సప్తమి మంగళవారం దివి. 12-09-2017 న ఉ॥ 06-51 ని॥లకు గురువు తుల రాశిలో ప్రవేశిస్తున్నాడు. ఈ రోజు నుండి శ్రీసార్థత్రికోటి తీర్థరాజ సహిత **కావేరీ నదికి** పుష్కర ప్రారంభము జరుగును.

పుష్కర కాలములో స్నానయోగ్యమైన కావేరీ నదీతీరములు తమిళనాడులో చిదంబరం, శ్రీరంగం, తంజావూరు, కుంభకోణం ప్రాంతములయందు కలవు.

**సూచన :-** గురు గ్రహం రాశి మారినప్పటి నుండి పన్నెండు రోజులపాటు పుష్కరములు జరుగును. అటువంటి పుణ్య సమయమునందు తృణము దానము చేసిననూ అనంతకోటి ఫలితములను ఇచ్చును. కావున పుష్కర సమయమునందు దానాదులు, జపాదులు, పితృదేవతల సంతృప్తికై చేయు పితృకర్మలు చేసిన శుభములు చేకూరును.

www.granthanidhi.blogspot.in

**రవిచారౌ ఆర్ద్రా ప్రవేశ కాలఫలమ్**

**శ్రీ హేమలంబ నామ సంవత్సరం జేష్ఠ బII ద్వాదశి తత్కాల త్రయోదశి బుధవారం దివి. 21-06-2017 న రాIIతెII 05-08-13 సెIIకు శ్రీ సూర్య భగవానుడు ఆర్ద్రా నక్షత్రములో ప్రవేశించుచున్నాడు.**

| | | |
|---|---|---|
| బII త్రయోదశి తిథి | - | **జలప్రదః** |
| బుధ వారం | - | **అర్ఘ వృద్ధిః** |
| కృత్తిక నక్షత్రం | - | **సువృష్టి** |
| ధృతి యోగం | - | **సుభిక్షం** |
| గరిజ కరణం | - | **జనక్షయం** |
| వృషభ లగ్నం | - | **సస్యవృష్టి** |
| తెల్లవారుఝాము కాలం | - | **సస్యవృద్ధి** |
| భరణీ మండలే | - | **సస్యవృద్ధి** |

# గ్రహణ నిర్ణయము

## చంద్ర గ్రహణం

**స్వస్తిశ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణ శుII ౧౫ సోమవారం దివి. 07-08-2017 శ్రవణ నక్షత్ర చతుర్థ పాద సంచార సమయే కేతుగ్రస్త పాక్షిక చంద్ర గ్రహణం.**

| | |
|---|---|
| సూర్య అస్తమయం | సాII 6-47 నిII |
| చంద్రోదయం | సాII 6-24 నిII |
| **గ్రహణ స్పర్శాకాలం** | **రాII 10** గంII **52** నిII **59** సెIIకు |
| **గ్రహణ మధ్యకాలం** | **రాII 11** గంII **50** నిII **29** సెIIకు |
| **గ్రహణ మోక్షకాలం** | **రాII 12** గంII **48** నిII **07** సెIIకు |

గ్రహణ ఆద్యన్త పుణ్యకాలం 1 గంట 55 నిIల 8సెII

**ఈ గ్రహణం భారతదేశముతో పాటు యూరప్, ఆఫ్రికా, ఆస్ట్రేలియా, ఆసియా ప్రాంతములయందు కూడా కనిపించును.**

**ఫలం :-** ఈ గ్రహణం శ్రవణ నక్షత్రం యందు సంభవించుటచే శ్రవణం,రోహిణి,హస్త నక్షత్రముల వారు, మకర రాశి వారు ఈ గ్రహణం చూడరాదు.

**నిత్యభోజన ప్రత్యాబ్దికముల విషయము :**

నిత్య భోజన ప్రత్యాబ్దికాదులు మరునాడు ఏర్పరుచుకోవలయును. ఉపాకర్మాదులు గ్రహణ దూషితం అవ్వడం వలన ఈ రోజు ఆచరించకూడదు, ఉపాకర్మాది నిర్ణయములకై పండుగల నిర్ణయముల పట్టిక పరిశీలించగలరు.

పిల్లలు,రోగులు, ముసలి వారు ఉII 11-00 గంIIల లోపు భోజనాదులు చేసుకోవచ్చును.

సాధకులు, మంత్రోపాసకులు ఉదయము నుండి ఉపవాస దీక్షతో ఉండవలయును. దేవాలయములు ఉII 10-00 గంII నుండి మూసిఉంచి గ్రహణ అనంతరం శుద్ధి చేసి దేవాలయములు తెరువవలయును.

www.granthanidhi.blogspot.in

## సంపూర్ణ చంద్ర గ్రహణం

స్వస్తిశ్రీ హేమలంబ నామ సంవత్సర మాఘ శు॥ ౧౫ బుధవారం దివి. **31-01-2018 పుష్యమీ నక్షత్ర చతుర్థ పాద, ఆశ్రేషా నక్షత్ర ప్రథమ పాద సంచార సమయే రాహుగ్రస్త సంపూర్ణ చంద్ర గ్రహణం.**

| | |
|---|---|
| సూర్య అస్తమయం | సా॥ 6-10 ని॥ |
| చంద్రోదయం | సా॥ 6-09 ని॥ |
| **గ్రహణ స్పర్శాకాలం** | **సా॥ 5** గం॥ **18** ని॥ **27** సె॥ |
| **గ్రహణ నిమీలన కాలం** | **సా॥ 6** గం॥ **21** ని॥ **47** సె॥ |
| **గ్రహణ మధ్య కాలం** | **సా॥ 6** గం॥ **59** ని॥ **51** సె॥ |
| **గ్రహణ ఉన్మీలన కాలం** | **రా॥ 7** గం॥ **37** ని॥ **52** సె॥ |
| **గ్రహణ మోక్షకాలం** | **రా॥ 8** గం॥ **41** ని॥ **11** సె॥ |

గ్రహణ ఆద్యన్త పుణ్యకాలం 3 గంటల 22 ని॥ల 44 సె॥

**ఈ గ్రహణం భారతదేశముతో పాటు ఆసియా, ఆస్ట్రేలియా, ఫసిఫిక్, నార్త్, వెస్ట్ అమెరికా ప్రాంతములయందు కూడా కనిపించును.**

**ఫలం :-** ఈ గ్రహణం పుష్యమి, ఆశ్రేష నక్షత్రముల యందు సంభవించుటచే పుష్యమి, అనూరాధ, ఉత్తరాభాద్ర, ఆశ్రేష జ్యేష్ఠ, రేవతి, నక్షత్రముల వారు, కర్కాటక రాశి వారు ఈ గ్రహణం చూడరాదు.

**నిత్యభోజన ప్రత్యాబ్ధికముల విషయము :**

నిత్య భోజన ప్రత్యాబ్ధికాదులు మరునాడు ఏర్పరుచుకోవలయును. సాధకులు, మంత్రోపాసకులు ఉదయము నుండి ఉపవాస దీక్షతో ఉండవలయును. దేవాలయములు సూర్యోదయము నుండే మూసిఉంచి గ్రహణ అనంతరం శుద్ధి చేసి దేవాలయములు తెరువవలయును.

**భారతదేశమున కనిపించని గ్రహణములు**

**21-08-2017** న **సంపూర్ణ సూర్యగ్రహణం** నార్త్ అమెరిక, సౌత్ అమెరిక, ఫసిఫిక్, అట్లాంటిక్ ప్రాంతములయందు కనిపించును.

**15-02-2018** న **పాక్షిక సూర్యగ్రహణం** సౌత్ అమెరిక, అట్లాంటిక ప్రాంతముల యందు కనిపించును.

కనిపించని గ్రహణములకు నియమములు పాటించవలసిన అవసరములేదు.

---

## గ్రహణ సమయ నియమాదులు

అమావాస్య పాడ్యమి తిథుల సంధియందు **సూర్యగ్రహణం**, పౌర్ణమి పాడ్యమి తిథుల సంధియందు **చంద్రగ్రహణం** సంభవించును. రాత్రియందు సూర్యగ్రహణం పగటి చంద్రగ్రహణం ఆచరణ యోగ్యం కానిది. మేఘాచ్ఛాదితమైనను ఆచరణ యోగ్యం. సందేహం కల్గిన శాస్త్రమును సరిచూసుకొని ఆచరించవలయును. గ్రహణములు కల్గునపుడు సర్వవర్ణులకు సూతకం కలుగును. కనుక స్పర్శ ప్రారంభమునకు స్నానంచేసి

ముక్తికాలం పూర్తికాగానే ముక్తిస్నానం చేయవలయును. ఈ గ్రహణ సమయమున వండిన పదార్థములు జలం, చల్ల పెరుగు పాలు భక్ష్య వస్తువులు వర్జనీయం, తిలలు ధర్భలు, వాటియందు ఉంచిన దోషం లేదు. సూర్య చంద్రగ్రహణములు ఎంత కాలమో చాక్షుష దర్శనం ఎప్పుడవునో అది మోక్షకాలం. మేఘాది ప్రతిబంధకం కల్గినప్పుడు శాస్త్రమును ఆశ్రయించవలయును. సూర్యగ్రహణమునకు 4 యామములు చంద్ర గ్రహణమున 3 యామములయందు నుండి భుజింపకూడదు. శ్రాద్ధం నిత్యనైమిత్తికములలో సాయంత్రం రాత్రి సమయాలలో పెట్టకూడదు. కాని గ్రహణ సమయంలో నిర్వర్తించవచ్చును.

శ్లో॥ **గ్రస్యమానే భవేత్స్నానం గ్రస్తే హోమోర్క చంద్రయోః !**
**మండలే ముచ్యమానేతు దానం ముక్తౌతు మజ్జనం !!**

గ్రహణస్పర్శా సమయంలో స్నానం, జపం, మధ్యకాలంలో హోమం, దేవతార్చనం, శ్రాద్ధం విడుచుచుండగా బ్రాహ్మణపూజ దానాదులు ముక్తిస్నానం చేయుట ద్వారా అనంతకోటి ఫలితం పొందుదురు. గ్రహణ కాలంలో హిరణ్య శ్రాద్ధం చేయవలయును. శక్తి లేని పక్షములో అఖరికి తర్పణాదులు విడిచినను అనంతమైన పుణ్యప్రదం, గ్రహణ కాలమున మంత్రోపాసకులు బ్రహ్మోపదేశం తీసుకొన్నవారు, గాయత్రీ మంత్ర ఉపాసకులు తత్తన్మంత్రములను యధాశక్తిగా జపాదులు చేయవలయును. లేనిచో మంత్రమాలిన్య దోషము కలుగును.

**రాహు/కేతు గ్రస్త సోమో/సూర్యోపరాగ సమయే మంత్రమాలిన్య దోష నివృత్యర్థం యధాశక్తి (ఉపాసన) మంత్ర జపం కరిష్యే !.** అని సంకల్పించి జపం చేయవలయును.

**ఈ గ్రహణ కాలమున శయనించిన రోగం కల్గును. మైధునం చేసిన గ్రామ సూకర జన్మ వచ్చును. ఆదర్శావేక్షణం (అద్దం చూడటం) మొదలగు భోగములు కల్పించుకున్న కుష్టివ్యాధి కలుగును. భోజనం చేసిన నరకం సంప్రాప్తించును. గ్రహణ కాలమందు సర్వులు దైవ చింతనతో ఉండవలయును.**

ఈ గ్రహణ కాలమున సర్వజలములు నదులు వాపికూప తటాకాదులు గంగాజలంతో సమానం. **విప్రుడు, బ్రహ్మతో, దైవజ్ఞుడు విష్ణువుతో బ్రహ్మచారి సదాశివునితో సమానం.** తృణప్రాయమైన దానం అనంత కోటిఫలం ఇచ్చును, ఈ గ్రహణ కాలమున గో, భూ మొదలగు 98 దానములలో ఏ దానం చేసినను మహా ఫలప్రదం.

ఈ గ్రహణం జన్మ నక్షత్రం నామ నక్షత్రం జన్మరాశి పంచమరాశి సప్తమ రాశి దశమ, ద్వాదశ రాశుల యందు సంభవించిన వారు గ్రహణ శాంతి చేయించుకోవలయును. సువర్ణ సూర్య ప్రతిమను, రజిత చంద్ర ప్రతిమను రాగి సర్ప ప్రతిమను పూజ చేసి మూడింటితో పాటుగా యధాశక్తి ధన ధాన్యాదులు దానమివ్వవలెను. దీనిద్వారా మహా ఫలమగు పుణ్యం సంప్రాప్తం అగును.

**గ్రహణానంతరం ప్రతి ఒక్కరు అశ్వత్థ వృక్షమును గాని, ఉసిరిక వృక్షమును గాని దర్శించవలయును.** దీని ద్వారా గ్రహణంలో సంపాదించిన పుణ్యం ద్విగుణీకృతం అగును.

| శ్రీ హేమలంబ నామ సం॥ వర్ష ధాన్యాదుల నిర్ణయము | | | | | |
|---|---|---|---|---|---|
| వర్షం | - 11 | మాత్సర్యం | - 13 | నిద్ర | - 09 |
| ధాన్యం | - 07 | సుఖం | - 03 | ఆలస్యం | - 06 |
| శీతం | - 13 | దుఃఖం | - 07 | ఉద్యోగం | - 09 |
| తృణం | - 07 | భోగం | - 09 | శాంతం | - 10 |
| ఉష్ణం | - 17 | విడంబం | - 09 | క్రోధం | - 09 |
| మరుతం | - 13 | మనోవేదన | - 07 | డంబం | - 05 |
| ప్రజావృద్ధి | - 15 | ద్వేషం | - 03 | మిత్రబేధం | - 04 |
| తన్నాశం | - 15 | ప్రతిష్ఠ | - 15 | ఇష్టత | - 10 |
| రాజత్వం | - 11 | అప్రతిష్ఠ | - 09 | రసనిష్పత్తి | - 07 |
| ఉగ్రం | - 05 | ద్యూతం | - 19 | ఫలనిష్పత్తి | - 09 |
| పుణ్యం | - 05 | మత్తత | - 11 | ఉత్సాహం | - 08 |
| పాపం | - 05 | పురుషోత్పత్తి | - 19 | **జ్ఞానం** | - 03 |
| **వ్యాధి** | - 11 | స్త్రీ ఉత్పత్తి | - 09 | అజ్ఞానం | - 11 |
| ఉపశమనం | - 11 | ధాతువాదం | - 15 | కపటం | - 17 |
| ఆచారం | - 17 | భయం | - 03 | నిష్కపటం | - 07 |
| అనాచారం | - 17 | శౌర్యం | - 07 | ధార్మికం | - 09 |
| జననం | - 15 | దుష్టనిగ్రహం | - 11 | అధార్మికం | - 03 |
| మరణం | - 15 | శిష్టపాలనం | - 15 | **గో వృద్ధి** | - 01 |
| దేశోపప్లవం | - 03 | సత్యం | - 19 | తన్నాశం | - 07 |
| దేశస్వాస్థ్యం | - 17 | అసత్యం | - 05 | సస్యకీటవృద్ధి | - 13 |
| చోరభయం | - 09 | విశ్వాసం | - 07 | తన్నాశం | - 13 |
| తన్నాశం | - 15 | అవిశ్వాసం | - 09 | శరభవృద్ధి | - 01 |
| అగ్నిభయం | - 03 | దయ | - 11 | తన్నాశం | - 01 |
| శాంతి | - 09 | నిర్దయ | - 13 | మశకవృద్ధి | - 01 |
| మృగవృద్ధి | - 19 | న్యాయం | - 15 | తన్నాశం | - 07 |
| మృగ దుర్భిక్షం | - 17 | అన్యాయం | - 17 | మత్కుణవృద్ధి | - 04 |
| కీటకభయం | - 03 | **సస్యవృద్ధి** | - 04 | తన్నాశం | - 07 |
| తన్నాశం | - 13 | తన్నాశం | - 06 | వృశ్చికవృద్ధి | - 10 |
| మూషకోద్భవం | - 15 | పశువృద్ధి | - 04 | తన్నాశం | - 10 |
| తన్నాశం | - 09 | తన్నాశం | - 07 | వ్యాఘ్రవృద్ధి | - 13 |
| సర్పవృద్ధి | - 13 | శుకవృద్ధి | - 07 | తన్నాశం | - 10 |
| తన్నాశం | - 11 | తన్నాశం | - 07 | **పక్షివృద్ధి** | - 02 |
| కామం | - 03 | ధృమవృద్ధి | - 08 | తన్నాశం | - 01 |
| లోభం | - 07 | తన్నాశం | - 08 | ధేనువృద్ధి | - 05 |
| మోహం | - 07 | **క్షుధ** | - 08 | తన్నాశం | - 01 |
| మదం | - 03 | తృష్ణ | - 05 | మహిషవృద్ధి | - 05 |

| | | | | | |
|---|---|---|---|---|---|
| తన్నాశం | - 05 | **సువర్ణవృద్ధి** | - 00 | ధాత్రీవృద్ధి | - 01 |
| మృగవృద్ధి | - 01 | రజితవృద్ధి | - 02 | **అతివృష్టి** | - 11 |
| తన్నాశం | - 04 | తామ్రవృద్ధి | - 08 | అనావృష్టి | - 11 |
| ఖగవృద్ధి | - 04 | కాంస్యవృద్ధి | - 02 | మూషికవృద్ధి | - 05 |
| తన్నాశం | - 01 | లోహవృద్ధి | - 12 | శలభవృద్ధి | - 13 |
| అశ్వవృద్ధి | - 03 | అయస్కాంతవృద్ధి | - 08 | శుకవృద్ధి | - 09 |
| తన్నాశం | - 03 | త్రపువృద్ధి | - 10 | స్వచక్రవృద్ధి | - 03 |
| గజవృద్ధి | - 01 | సీసవృద్ధి | - 10 | పరచక్రవృద్ధి | - 17 |
| తన్నాశం | - 01 | రసవృద్ధి | - 06 | **స్వప్న** | - 06 |
| ఉష్ట్రవృద్ధి | - 02 | **వ్రీహివృద్ధి** | - 08 | సుషుప్తి | - 02 |
| తన్నాశం | - 02 | శాలివృద్ధి | - 08 | జాగ్రత | - 08 |
| విప్రవృద్ధి | - 03 | కుళుత్థవృద్ధి | - 08 | పైశూన్య | - 02 |
| తన్నాశం | - 02 | తిలవృద్ధి | - 12 | క్రోధం | - 12 |
| క్షత్రియవృద్ధి | - 05 | మాషవృద్ధి | - 10 | జ్ఞానం | - 08 |
| తన్నాశం | - 04 | ముద్గవృద్ధి | - 08 | అజ్ఞానం | - 10 |
| వైశ్యవృద్ధి | - 04 | సర్షపవృద్ధి | - 02 | భుక్తి | - 10 |
| తన్నాశం | - 01 | చణకవృద్ధి | - 14 | ధ్యానం | - 06 |
| శూద్రవృద్ధి | - 05 | ఆఢకవృద్ధి | - 14 | **అండజవృద్ధి** | - 11 |
| తన్నాశం | - 03 | గోధుమవృద్ధి | - 12 | తన్నాశం | - 07 |
| మ్లేచ్ఛవృద్ధి | - 04 | కోద్రవవృద్ధి | - 04 | స్వేదజవృద్ధి | - 13 |
| తన్నాశం | - 04 | ప్రియంగవవృద్ధి | - 10 | తన్నాశం | - 07 |
| సంకరవృద్ధి | - 03 | యవవృద్ధి | - 12 | ఉద్భిజవృద్ధి | - 17 |
| తన్నాశం | - 01 | శ్యామావృద్ధి | - 06 | తన్నాశం | - 13 |
| నవరత్నవృద్ధి | - 03 | రాజమాషవృద్ధి | - 14 | జరాయుజవృద్ధి | - 15 |
| తన్నాశం | - 05 | నీవారవృద్ధి | - 16 | తన్నాశం | - 15 |
| మరకతవృద్ధి | - 02 | శింబుధాన్యవృద్ధి | - 12 | స్థావరవృద్ధి | - 11 |
| మాణిక్యవృద్ధి | - 03 | **పనసవృద్ధి** | - 07 | తన్నాశం | - 05 |
| వజ్రవృద్ధి | - 04 | నారికేళవృద్ధి | - 04 | జంగమవృద్ధి | - 05 |
| వైఢూర్యవృద్ధి | - 05 | మాతువృద్ధి | - 07 | తన్నాశం | - 05 |
| గోమేధికవృద్ధి | - 01 | జంబీరవృద్ధి | - 16 | **విద్యుత్తు** | - 13 |
| పుష్యరాగవృద్ధి | - 01 | ఖర్జూరవృద్ధి | - 10 | శిలాపాతం | - 03 |
| ఇన్ద్రనీలవృద్ధి | - 01 | రంభాఫలవృద్ధి | - 19 | గర్జితం | - 06 |
| ప్రవాళవృద్ధి | - 01 | చూతఫలవృద్ధి | - 07 | | |
| మౌక్తికవృద్ధి | - 01 | కపిత్థవృద్ధి | - 19 | ***WWW.SIDHANTHI.COM*** | |
| ఇతరరత్నవృద్ధి | - 01 | తింత్రిణీవృద్ధి | - 25 | | |

**BrahmaSri. DAIVAGNA L. SUBRAHMANYA SIDDHANTHY**
**e-mail: lssiddhanthy@gmail.com,9963732303, 9550017576, 9866839560.**

www.granthanidhi.blogspot.in

## కార్తెల చక్రం

| కార్తెపేరు | తేది | వారం | సమయం | వాహనం | ఫలం |
|---|---|---|---|---|---|
| అశ్విని | 13-04-2017 | గురు | రా॥ 02-04 | గాడిద | అల్పవృష్టి |
| భరణి | 27-04-2017 | గురు | సా॥ 05-52 | నక్క | సువృష్టి |
| కృత్తిక | 11-05-2017 | గురు | మ॥ 12-02 | దున్న | అల్పవృష్టి |
| రోహిణి | 25-05-2017 | గురు | ఉ॥ 08-15 | గుఱ్ఱం | సుభిక్షం |
| మృగశిర | 08-06-2017 | గురు | ఉ॥ 06-06 | మేక | నిర్జలం |
| ఆర్ద్రా | 21-06-2017 | బుధ | రా॥తె॥ 05-08 | గాడిద | అల్పవృష్టి |
| పునర్వసు | 05-07-2017 | బుధ | రా॥తె॥ 04-39 | నక్క | సువృష్టి |
| పుష్యమి | 19-07-2017 | బుధ | రా॥తె॥ 04-14 | నెమలి | మహావాయువు |
| ఆశ్రేష | 02-08-2017 | బుధ | రా॥తె॥ 03-03 | ఎలుక | పర్వత వృష్టి |
| మఖ | 16-08-2017 | బుధ | రా॥ 12-47 | మేక | నిర్జలం |
| పుబ్బ | 30-08-2017 | బుధ | రా॥ 08-39 | ఏనుగు | సుభిక్షం |
| ఉత్తర | 13-09-2017 | బుధ | మ॥ 02-35 | కప్ప | సువృష్టి |
| హస్త | 26-09-2017 | మంగళ | రా॥తె॥ 05-59 | నెమలి | మహావాయువు |
| చిత్త | 10-10-2017 | మంగళ | రా॥ 07-03 | ఎలుక | పర్వత వృష్టి |
| స్వాతి | 23-10-2017 | శుక్ర | రా॥తె॥ 05-28 | మేక | నిర్జలం |
| విశాఖ | 06-11-2017 | సోమ | మ॥ 01-39 | గాడిద | అల్పవృష్టి |
| అనూరాధ | 19-11-2017 | ఆది | రా॥ 07-39 | ఎలుక | పర్వత వృష్టి |
| జ్యేష్ఠ | 02-12-2017 | శని | రా॥ 11-58 | మేక | నిర్జలం |
| మూల | 15-12-2017 | శుక్ర | రా॥తె॥ 03-01 | ఏనుగు | సుభిక్షం |

## లగ్నశుద్ధి వివరములు

**శ్లో॥ ప్రవేశే ద్వాదశశుద్ధి పట్టమేకాదశస్తథా ।**
**ప్రాశనం దశమంశుద్ధి నవ సీమంతచౌలయోః ॥**
**ఉపనీతంచాష్టమంచ వివాహం చైవసప్తమే । షష్ఠేతు నవవస్త్రాణి ప్రయాణం చైవపంచమే ॥**
**చతుర్థే శతృసంయోగం తృతీయే రాజదర్శనం । ద్వితీయే ధననిక్షేపం లగ్నం స్త్రీసంగమం తథా ॥**

ప్రవేశమునకు ద్వాదశశుద్ధి, పట్టాభిషేకమునకు ఏకాదశశుద్ధి, అన్నప్రాశనకు దశమశుద్ధి, సీమంత,చౌలములకు నవమ శుద్ధి, ఉపనయనమునకు అష్టమశుద్ధి, వివాహమునకు సప్తమశుద్ధి, నూతనవస్త్రధారణకు షష్ఠమశుద్ధి, ప్రయాణమునకు పంచమ శుద్ధి, శత్రు ప్రాంతమునకు వెళ్లుటకు చతుర్థశుద్ధి, రాజ (అధికార) కలయికకు తృతీయశుద్ధి, ధన సంబంధమైన ద్వితీయశుద్ధి, స్త్రీకలయికకు లగ్నశుద్ధి తప్పనిసరి అని శాస్త్రవచనం.

## కందాయ ఫలములు

| అ | భ | కృ | రో | మృ | ఆ | పు | పుష్య | ఆశ్లే | మఖ | పుబ్బ | ఉత్త | హస్త | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | ప్రథమం |
| 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | ద్వితీయం |
| 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | తృతీయం |

| చి | స్వా | విశా | అనూ | జ్యే | ము | పూ.షా. | ఉ.షా. | శ్ర | ధ | శత | పూ.భా. | ఉ.భా. | రేవతి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 0 | 3 | 6 | 1 | 4 | 7 | 2 | 5 | 0 | 3 | 6 | 1 | 4 | 7 |
| 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 | 1 | 2 | 0 |
| 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 | 2 | 0 | 3 | 1 | 4 |

శ్లో॥ ఆదిశూన్యే మహా వ్యాధి ! మధ్య శూన్యే మనో వ్యథా !!
అంత్యశూన్యేర్ధ నాశస్యాత్ ! త్రిశూన్యే నిష్ఫలం భవేత్ !!
విషమేష్వర్ధ లాభస్యాత్ ! సమేతు సమతా భవేత్ !!
శూన్యేతు శూన్య మాప్నోతి ! కందాయ ఫలమీదృషం !!

మొదటి సున్నా ఉన్నచో మహా వ్యాధి(భయం), మధ్య సున్నాఉన్నచో మనో వ్యధ(ఋణాధికం) చివరి సున్నా ఉన్నచో ధనహాని, మూడు సున్నాలు ఉన్నచో అనేకమగు ఇబ్బందులు కలుగును. సరిసంఖ్య వచ్చిన సమమైన ఫలితము, బేసిసంఖ్య వచ్చినచో ధనలాభము కలుగును. (ఒక్కొక్క కందాయము నాలుగు మాసములు ఫలితము నిచ్చును.)

## ఆదాయ వ్యయములు

| రాశి | ఆదాయం | వ్యయం | రాజపూజ్యం | అవమానం |
|---|---|---|---|---|
| మేషం | 08 | 14 | 04 | 03 |
| వృషభం | 02 | 08 | 07 | 03 |
| మిధునం | 05 | 05 | 03 | 06 |
| కర్కాటకం | 14 | 02 | 06 | 06 |
| సింహం | 02 | 11 | 02 | 02 |
| కన్య | 05 | 05 | 05 | 02 |
| తుల | 02 | 08 | 01 | 05 |
| వృశ్చికం | 08 | 14 | 04 | 05 |
| ధనస్సు | 11 | 05 | 07 | 05 |
| మకరం | 14 | 14 | 03 | 01 |
| కుంభం | 14 | 14 | 06 | 01 |
| మీనం | 11 | 05 | 02 | 04 |

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## శ్రీ హేమలంబ నామ సంవత్సర చాంద్రమాన ఉగాది నిర్ణయం

**దృక్ పద్ధతి రీత్యా**

ది.వి.28-03-2017 మంగళవారం సూర్యోదయం 6 గం॥ 14 ని॥ 41 సె॥కు.
శ్రీ దుర్ముఖ నామ సం॥ ఫాల్గుణ బ॥అమావాస్య ౫-౨౯, (ఉ॥ **08** గం॥ **26** ని॥ **12** సె॥),
శ్రీ హేమలంబ నామ సం॥ చైత్ర శుద్ధ ప్రతిపద (ఏష్యా) ౫౩-౧౬, (**రా॥తె॥ 05** గం॥ **44** ని॥ **36** సె॥).
**ఈ విధముగా వచ్చుట వలన పాడ్యమి అవమ తిథి అయినది.** పాడ్యమికి మరుదినము ఏమాత్రమూ స్పర్శ లేదు.

**పూర్వ పద్ధతి రీత్యా** ది.వి.28-03-2017 మంగళవారం శ్రీ దుర్ముఖ నామ సం॥ ఫాల్గుణ బ॥అమావాస్య ౫-౫౮, (ఉ॥ **08** గం॥ **37** ని॥).
ది.వి.29-03-2017 బుధవారం శ్రీ హేమలంబ నామ సం॥ చైత్ర శుద్ధ ప్రతిపద ౧-౫౩, (ఉ॥ **06** గం॥ **59** ని॥). చైత్ర శుద్ధ విదియ (ఏష్యా) ౫౫-౧౪, (**రా॥తె॥ 05** గం॥ **05** ని॥).

శ్లో॥ దిన ద్వయే తద్వ్యాప్తౌ వవ్యాప్తౌవా పూర్వైవ ॥ ( ధర్మసింధు, నిర్ణయ సింధు ).
చైత్రేసిద ప్రతిపది యోవారోర్కో్దయే సవర్షేశః ।
ఉదయ ద్వితయే పూర్వోనోదయ యుగళే పి పూర్వస్స్యాత్ ।
యస్మాచ్చైత్ర సితాదేరుదయాద్భానోః ప్రవృత్తిరబ్దాదేరితి ॥
( జ్యోతిర్నిబంధం, నిర్ణయ సింధు ).

శ్లో॥ వత్సరాదౌ వసంతాదౌ బలిరాజ్యే తథైవచ ।
పూర్వ విద్దైవ కర్తవ్యా ప్రతిపత్సర్వదా బుధైః ॥ ( వృద్ధ వసిష్ఠ ).

శ్లో॥ తిథి శ్శరీరం తిథిరేవ కారణం తిథి ప్రమాణం తిథిరేవ సాధనం ॥

శ్లో॥ శుక్ల ప్రతిపత్ పూర్వవిద్ధా గ్రాహ్యా ప్రతిపద్యమావాస్యేతి యుగ్మవాక్యాత్ ॥
( కాలనిర్ణయ చంద్రిక).

శ్లో॥ దినద్వయే ఉదయ వ్యాప్తావవ్యాప్తౌవా పూర్వైవ ॥
( భగవంత భాస్కర, సమయ మయూఖ).

యదా పూర్వేద్యురుదయ కాలం పరిత్యజ్యోపరి సర్వత్ర వ్యాప్నోతి పరేద్యురుదయకాల మాత్రం వ్యాప్నోతి తదానీముదయానంతర భావిన్యాముఖ్యత్వాత్ త్రిముహూర్త వ్యాప్తిర్దినద్వయేప్యభావేచ ద్వయోరపి గౌణకాలత్వేసతి కింగ్రాహ్యమితి వివక్షాయాం పూర్వదినే కర్మకాల వ్యాప్తి భూయస్త్వాత్తస్యైవ గ్రహణ న్యాయతః ॥

ఆదిత్యోదయ వేళాయాం అల్పాపిచ తిథిర్భవేత్ । పూర్ణా ఇత్యేవమంతవ్యా ప్రభూతానోదయం దినేతి । తదా పూర్వేద్యుస్సంగవమారభ్య పరేద్యురుదయాత్ప్రాగేవ తిథిక్షయవశాత్ప్రతిపత్సమాప్తౌ । తదా యద్యపి దినద్వయేపి ఉదయ ముహూర్త త్రయస్య స్పర్శోనాస్తి తదా పూర్వేద్యురేవానుష్ఠేయం ॥ ( కాల మాధవీయం ).

www.granthanidhi.blogspot.in

## శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

వంద సంవత్సరములకు పూర్వము **పూర్వ పద్ధతి రీత్యా** శ్రీ శోభకృత్ నామ సంవత్సరము 29-03-1903 ఆదివారము రోజున అమావాస్య తిథి ౧-౧౬, **(దృక్ రీత్యా** ౧-౪౦,) 30-03-1903 సోమవారము రోజున చైత్రశు॥ ప్రతిపద తిథి ౦-౨౧, **(దృక్ రీత్యా** ౦-౨౮,) అని వచ్చినప్పుడు అప్పటి సిద్ధాంతులు, పండితులు జగద్గురువులను ఆశ్రయించగా పై ధర్మ శాస్త్ర గ్రంధములను ఉదహరిస్తూ ఉదయకాల "ముహూర్తత్రయ వ్యాపినీత్వము" లేనందున ముందురోజే ఉగాది అని నిర్ణయించిరి.

**ఈ సంవత్సరం కూడా పూర్వపద్ధతి వారికి** 29-03-2017 న మూడు ముహూర్తములు (6ఘడియలు) లేనందున వారుకూడా ముందురోజే (**28**-03-2017 మంగళవారం రోజుననే) ఉగాదిని నిర్ణయించవలయును. అదేవిధముగా...

**పరేద్యుః ప్రతిపదభావో యది తదా అమాయుక్తాపి కార్యా ॥ ( వసిష్ఠ ).**

పై ఆధారముల వలన **దృక్‌పద్ధతిరీత్యా** ది.వి. 28-03-2017 మంగళవారము రోజున ప్రతిపద సంగవ కాలమందు ఆరంభించి తిథి క్షయము వలన పరదినమందు (29-03-2017 బుధవారం) ఉదయమునకు పూర్వమే సమాప్తి పొందుచున్నది. ఉదయకాలములో ప్రతిపద లేనందున పూర్వ దినమందు అమావాస్య మూడు ముహూర్తములు వ్యాప్తి ఉండి ప్రతిపద క్షయమైనందున (**క్షీయమాణేతు పూర్వైవ**) ముందు రోజే (**28**-03-2017 మంగళవారం రోజుననే) ఉగాదిని ఆచరించవలయును.

రెండుదినముల యందు ఉదయ స్పర్శ లేదు, అట్టి సమయమందు ఏ తిథి యందు సూర్యుడు అస్తమించుచున్నాడో ఆ తిథి సాకల్యముగా తెలియదగినది, ఏ తిథి యందు సూర్యుడు ఉదయాస్తమయము పొందునో అది పూర్ణ తిథి అగును, విభేదించిన ఖండ తిథి అగును.

కావున ధర్మసింధు, నిర్ణయసింధు, కాలనిర్ణయ చంద్రిక, కాలమాధవీయం, భగవంత భాస్కర, వృద్ధ వసిష్ఠ, వీరమిత్రోదయ, జ్యోతిర్నిబంధం మొదలగు ధర్మశాస్త్ర గ్రంధముల ఆధారముగా ప్రతిపద క్షయ వశముచేత మరునాటి సూర్యోదయమునకు పూర్వమే పూర్తి అగుట వలన సర్వులూ **ది.వి. 28-03-2017 మంగళవారము** రోజుననే చాంద్రమాన శ్రీహేమలంబ నామ సంవత్సర ఉగాది పండుగను ఆచరించవలయును.

**28-03-2017 రోజుననే శ్రీ హేమలంబ నామ సంవత్సర చాంద్రమాన ఉగాది.**

దృక్ పద్ధతి ద్వారా వచ్చిన తిథులే సర్వ కర్మలకూ గ్రాహ్యము

**॥ దృక్తుల్యతాం సిద్ధే స్తైరిహ పర్వ ధర్మ నయ సత్కార్యాదికం త్వాదిశేత్ ॥**

మరిన్ని వివరములకు దృక్ ఆవశ్యకత పై పంచాంగములో నేను ఇచ్చిన వ్యాసము గమనించగలరు.

**అంతరిక్ష నిరూపణకు సరిపోయే దృక్సిద్ధాంతమే సర్వదా ఆచరణ యోగ్యము.**

**ఇట్టి నిర్ణయములు 08-08-2016 నుండి 09-08-2016 వరకు జరిగిన పంచాంగ పండిత సదస్సు లో జగద్గురువులచే ఆమోదించబడినవి.**

**విద్వత్కృపాభిలాషి దైవజ్ఞ యల్.సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## శ్రీరామ నవమి నిర్ణయం

ది.వి.04-04-2017 మంగళవారం చైత్ర శు॥అష్టమి ౧౩-౧, (ఉ॥ **11-20**),
పునర్వసు ౪౨-౪౧, (రా॥ **11-12**).
ది.వి.05-04-2017 బుధవారం చైత్ర శు॥నవమి ౯-౪౮, (ఉ॥ **10-03**),
పుష్యమి ౪౧-౫౦, (రా॥ **10-52**).

**ఈ విధముగా వచ్చుట వలన**
**చైత్ర శుక్ల నవమ్యాం శ్రీరామనవమీ వ్రతం కార్యమ్ । సా మధ్యాహ్న వ్యాపిని గ్రాహ్యా ॥**
**తథాచోక్తం అగస్త్య సంహితాయాం ॥**

**శ్లో॥ చైత్రమాసే శుక్ల పక్షే నవమ్యాంతు పునర్వసౌ ।**
**మధ్యాహ్నే కర్కటకే లగ్నే జాతో రామస్స్వయం హరిః ॥ ( వ్రతనిర్ణయ ).**

పై ఆధారముల వలన మధ్యాహ్న వాపినీత్వము కలిగిన ది.వి. 04-04-2017 మంగళవారము రోజున **స్మార్తులు** శ్రీరామనవమీ వ్రతోపవాసాదులు ఆచరించవలయును.

**శ్లో॥ నవమీచాష్టమీ విద్ధా త్యాజ్యా విష్ణు పరాయణైః ।**
**ఉపోషణం నవమ్యాంవై దశమ్యామేవ పారణమ్ ॥ ( వ్రతనిర్ణయ ).**
**శ్లో॥ యదాతు పూర్వదివసే నవమీ దూషితం భవేత్ ।**
**పరస్మిన్తు కళామాత్రం నవమీ యదినాస్తిచేత్ ॥**
**కేవలం దశమీమేవ ఉత్సవార్థం ప్రకల్పయేత్ ॥**
**చైత్రశుక్లాష్టమీ విద్ధా రహితా కలయాపిచ ॥**
**పరవేధ యుతావాపి కర్తవ్యా నవమీ దివా ॥ ( పరమ పురుష సంహిత ).**

పై ఆధారముల వలన అష్టమీ విద్ధ లేనటువంటి ది.వి. 05-04-2017 బుధవారము రోజున **వైష్ణవులు** శ్రీరామనవమీ (జయన్తీ) వ్రతోపవాసాదులు ఆచరించవలయును.

## చైత్ర బహుళ ఏకాదశి నిర్ణయం

ది.వి.21-04-2017 శుక్రవారం చైత్ర బ॥దశమి ౫౬-౨౩, (రా॥తె॥ **4-54**).
ది.వి.22-04-2017 శనివారం చైత్ర బ॥ఏకాదశి ౫౫-౨౦, (రా॥తె॥ **4-04**).
ది.వి.23-04-2017 ఆదివారం చైత్ర బ॥ద్వాదశి ౫౧-౧౫, (రా॥తె॥ **2-26**).

**ఈ విధముగా ఏకాదశికి అరుణోదయ వేధ ఉండుట వలన**
**ఉదయాత్ ప్రాక్ చతస్రస్తు నాడికా అరుణోదయ ఇతి ॥**

**శ్లో॥ దశమీ శేష సంయుక్తో యదిస్యాదరుణోదయః ।**
**నైవోపోష్యం వైష్ణవేన తద్దినైకాదశీ వ్రతం ॥**
**శ్లో॥ అరుణోదయ వేళాయాం దశమీ యది దృశ్యతే ।**
**ఉపోష్య ద్వాదశీం శుద్ధాం త్రయోదశ్యాంతు పారణమ్ ॥ ( వ్రతనిర్ణయ, గరుడ ).**

పై ఆధారముల వలన **స్మార్తులు** ది.వి. 22-04-2017 న ఉపవసించి ది.వి. 23-04-2017 న పారణ చేయవలయును.

**మధ్వ, వైష్ణవులు** అరుణోదయ వేధ కలిగిన ఏకాదశిని వదిలి ది.వి. 23-04-2017 న ఉపవసించి ది.వి. 24-04-2017 న పారణ చేయవలయును.

www.granthanidhi.blogspot.in

## శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

### అక్షయ తృతీయ నిర్ణయం

ది.వి. 28-04-2017 శుక్రవారం వైశాఖ శు॥విదియ ౧౧-౩౦, (ఉ॥ **10-29**).
ది.వి. 29-04-2017 శనివారం వైశాఖ శు॥తదియ ౨-౩౬, (ఉ॥ **6-55**),
ఉపరి శు॥చవితి ౫౧-౪౯, (రా॥తె॥ **3-39**).

**ఈ విధముగా వచ్చుట వలన**

**అక్షయ్య తృతీయా త్రిముహూర్త వ్యాపినీ గ్రాహ్యా ॥**
**త్రిముహూర్తాధిక వ్యాప్తి సత్వే పరా । త్రిముహూర్త మూనత్వే పూర్వా ॥**
**( ధర్మసింధు ).**

పై ఆధారముల వలన శనివారము రోజున త్రిముహూర్త వాపినీత్వము లేకపోవుట వలన సర్వులూ ది.వి. 28-04-2017 శుక్రవారము రోజున అక్షయ్య తృతీయ జప హోమ తర్పణ దానాది క్రియలు ఆచరించవలయును.

### ఆషాఢ బహుళ ఏకాదశి నిర్ణయం

ది.వి. 19-07-2017 బుధవారం ఆషాఢ బ॥దశమి ౩-౫౫, (ఉ॥ **7-25**),
ఉపరి బ॥ఏకాదశి ౫౨-౩౬, (రా॥తె॥ **4-27**).
ది.వి. 20-07-2017 గురువారం ఆషాఢ బ॥ద్వాదశి ౪౮-౨౧, (రా॥ **1-12**).

**శ్లో॥ విద్ధాప్యేకాదశీ గ్రాహ్యా పరతో ద్వాదశీ యది ॥**

పై ఆధారముల వలన **స్మార్తులు** దివి. 19-07-17 బుధవారం బ॥దశమి ఉపరి బ॥ఏకాదశి రోజున ఉపవసించి దివి. 20-07-17 గురువారం బ॥ద్వాదశి రోజున పారణ చేయవలయును.

**శ్లో॥ విద్దైకాదశీ యత్ర పరతో ద్వాదశీ యది ।**
**ద్వాదశ్యాముపవాసంచ త్రయోదశ్యాంతు పారణం ॥**

పై ఆధారముల వలన **మధ్వ,వైష్ణవులు** విద్ధ ఏకాదశిని విడిచిపెట్టి దివి. 20-07-17 గురువారం బ॥ద్వాదశి రోజున ఉపవసించి దివి. 21-07-17 శుక్రవారం బ॥ త్రయోదశి రోజున పారణ చేయవలయును.

### గరుడ (నాగ) పంచమి నిర్ణయం

ది.వి. 27-07-2017 గురువారం శ్రావణ శు॥చవితి ౨-౪౮, (ఉ॥ **7-01**).
ది.వి. 28-07-2017 శుక్రవారం శ్రావణ శు॥పంచమి ౧-౫౦, (ఉ॥ **6-38**).

**శ్రావణ శుక్ల పంచమ్యాం నాగపూజా కార్యా । సా పరవిద్ధా గ్రాహ్యా ॥**
**పరేద్యుః పంచమీ త్రిముహూర్తానోచేత్ పూర్వైవ గ్రాహ్యా ॥**
**( భవిష్య, వ్రత నిర్ణయ ).**

పై ఆధారముల వలన గరుడ పంచమిని ఎల్లవేళల యందూ పరవిద్ధనే తీసుకోవలయును, కానీ మరునాడు త్రిముహూర్త వ్యాపినీత్వం లేనప్పుడు పూర్వ విద్ధలోనే గరుడపంచమీ వ్రతమును ఆచరించవలయును. సర్వులూ ది.వి. 27-07-2017 గురువారము రోజున గరుడ పంచమీ వ్రతమును ఆచరించవలయును.

www.granthanidhi.blogspot.in

## శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

### ఉపాకర్మ నిర్ణయం

శ్లో॥ గ్రహణే సంక్రమేవాపి మౌఢ్యేపి గురుశుక్రయోః ।
ప్రోష్ఠపద్యాం ఉపాకుర్యాత్ శ్రావణేదూషితే యది ॥

శ్లో॥ ఉపాకర్మ నకుర్వీత క్రమాత్ సామర్గ్యజుర్విదః ।
గ్రహ సంక్రాంతి యుక్తేషు హస్త శ్రవణ పర్వసు ॥

పై ఆధారముల వలన శ్రీ హేమలంబ నామ సంవత్సర శ్రావణ పౌర్ణిమ, శ్రవణ నక్షత్రం చంద్రగ్రహణం వలన దూషితమగుట వలన ఋగ్వేదులకు శ్రవణ నక్షత్రమున ఉపాకర్మ పనికిరాదు, యజుర్వేదులకు శ్రావణ పౌర్ణిమ యందు ఉపాకర్మ పనికిరాదు, సామవేదులకు శ్రావణమాసం పనికిరాదు.

ప్రతివర్షం క్రీయమాణోపాకరణీతు మూఢాది దోషోపేతే ఽ పి ॥
శ్రావణ ఏవకార్యమిత్యుక్తం భవతి ॥
గ్రహణంతు ఉభయత్రాపి వర్జ్యమేవ కార్యం ॥

పై ఆధారముల వలన మౌఢ్యాది దోషములయితే ప్రతి వర్షము వారికి ఇబ్బంది లేకుండా చేసుకోవచ్చు, కేవలం మొదటిసారి చేసుకునేవారికే దోషం అని చెప్పవచ్చు.

కానీ చంద్రగ్రహణ దూషితమగుట వలన మొదటిసారి ఉపాకర్మ చేసుకొనువారికి, ప్రతి వర్షం చేసుకొనువారికీ ఇద్దరికీ పనికిరాదు.

శ్లో॥ అధ్యాయానాముపాకర్మ శ్రావణ్యాం తైత్తిరీయకాః ।
బహ్వృచశ్శ్రవణే కుర్యుః హస్తఋక్షే సామవేదినః ॥
పూర్ణిమా శ్రవణ హస్తాః పరయుతాః కార్యాః ॥

### ఋగ్వేద ఉపాకర్మ నిర్ణయం

**ఋగ్వేదులకు శ్రవణ నక్షత్రం ప్రాధాన్యం కానీ శ్రవణ నక్షత్రం గ్రహణ దూషితమగుట వలన హస్తపంచమీ గ్రాహ్యా॥**

దివి. 28-07-17 శుక్రవారం శ్రావణ శు॥పంచమి హస్త నక్షత్రం రోజున ఋగ్వేదీయులు ఉపాకర్మ ఆచరించవలయును.

### యజుర్వేద ఉపాకర్మ నిర్ణయం

**యజుర్వేదీయులకు పౌర్ణిమ ప్రాధాన్యం**

దివి. 06-09-17 బుధవారం భాద్రపద శు॥పౌర్ణిమ రోజున యజుర్వేదీయులు ఉపాకర్మ ఆచరించవలయును.

### సామవేద ఉపాకర్మ నిర్ణయం

**సామవేదీయులకు హస్తా నక్షత్రం ప్రాధాన్యం**

దివి. 25-08-17 శుక్రవారం భాద్రపద శు॥చవితి హస్త నక్షత్రం రోజున సామవేదీయులు ఉపాకర్మ ఆచరించవలయును. (**గమనిక** సామవేదీయులు సామవేద శాఖాధిపతి మౌఢ్యమి ఉండుట వలన శాఖాధిపతి శాన్తిచేసుకుని ఉపాకర్మ ఆచరించవలయును).

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## శ్రీ కృష్ణాష్టమి నిర్ణయం

ది.వి.14-08-2017 సోమవారం శ్రావణ బ॥సప్తమి ౩౪-౨౮, (**రా॥ 7-45**),
భరణి ౫౪-౫౮, (**రా॥తె॥ 3-57**).

ది.వి.15-08-2017 మంగళవారం శ్రావణ బ॥అష్టమి ౨౯-౧౧, (**సా॥ 5-39**),
కృత్తిక ౫౧-౨౦, (**రా॥ 2-31**).

ది.వి.16-08-2017 బుధవారం శ్రావణ బ॥నవమి ౨౩-౧౫, (**మ॥ 3-17**),
రోహిణి ౪౭-౮, (**రా॥ 12-50**). సింహ సంక్రమణం రా॥ 12-47ని.లకు.

**ఈ విధముగా వచ్చుట వలన**

**శ్లో॥ అష్టంమ్యాం శ్రావణేమాసి కృష్ణపక్షే నరాధిప ।**
**అర్ధరాత్రే జగన్నాథో దేవక్యాం అవతారయేత్ ॥ ( వ్రతనిర్ణయ ).**

**శ్రావణ కృష్ణాష్టమి శ్రీ కృష్ణ జన్మాష్టామి । సా అర్ధరాత్ర వ్యాపిని గ్రాహ్యా ॥**

పై ఆధారముల వలన స్మార్తులకు నక్షత్రము కంటే తిథి ప్రాధాన్యము అధికము కావున అష్టమికి అర్ధరాత్రి వ్యాపినీత్వం కలిగిన ది.వి.14-08-2017 సోమవారం రోజుననే **స్మార్తులు** శ్రీకృష్ణాష్టమి వ్రతం ఆచరించవలయును.

**సంక్రాన్తి దోష యుక్తాయాం వైష్ణవైర్నగ్రాహ్యం । సింహస్థే రవౌ శ్రావణే భాద్రేచ రోహిణీ యది అదూషితా భవేత్ తదా పరా గ్రాహ్యేత్యలం భూయసా ॥**

**శ్లో॥ అష్టమీ సప్తమీయుక్త రోహిణీ కృత్తికాన్వితా ।**
**తద్దినం వర్జయేద్ధీమాన్ తదన్యేవాసరే చరేత్ ॥**

**శ్లో॥ అష్టమ్యాం నవమ్యాం వా దశమ్యాం చ తథా పునః ।**
**మృగేణ సహితాష్టమ్యాం జయంత్యారాధనం కురు ॥**

**శ్లో॥ అష్టమ్యాం వా నవమ్యాం వా దశమ్యాం యది రోహిణీ ।**
**సా జయన్తి ఇతి విఖ్యాతా విష్ణువ్రత పరాయణైః ॥**

**శ్లో॥ వాజి విద్ధాష్టమీ త్యాజ్యా వహ్ని విద్ధాచ రోహిణీ ।**
**దశమ్యామేకాదశీ విద్ధాహంతి పుణ్యం పురాకృతం ॥**

పై ఆధారముల వలన శ్రవాణ మాసము యందు అష్టమి, రోహిణీ నక్షత్రములకు సంక్రమణ దోషము ఉండుటచే భాద్రపద మాసమునందు సింహార్క యోగము, రోహిణీ యుక్త పరవిద్ధాష్టమి అయిన ది.వి.13-09-2017 బుధవారం రోజున **పాంచరాత్రులు, వైఖానసులు** గోకులాష్టమిని, శ్రీ కణ్ణన్‌తిరునక్షత్ర వ్రతములను ఆచరించవలయును.

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## శ్రీ సరస్వతీ పూజా నిర్ణయం

ది.వి. 27-09-2017 బుధవారం ఆశ్వీయుజ శు॥సప్తమి ౩౨-౩౫, (రా॥ **7-08**),
జ్యేష్ఠ ౯-౪౧, (ఉ॥ **9-58**),
ది.వి. 28-09-2017 గురువారం ఆశ్వీయుజ శు॥అష్టమి ౩౮-౪౬, (రా॥ **9-36**),
మూల ౧౭-౮, (మ॥ **12-57**),

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ మూలాద్యృక్షత్రయే రాజన్ దేవీం పుస్తక రూపిణీం ।**
**పూజయేత్ భక్తి భావేన శ్రవణార్క్షే విసర్జయేత్ ॥**
**శ్లో॥ మూలాదౌ పూజనం దేవ్యా శ్రృవాణాదౌ విసర్జనం ।**
**తావుభౌ నిశిచేత్ స్యాతాముఖే ప్రాతః పరేహని ॥**
**శ్లో॥ ఏతత్సరస్వతీ పూజనం మూలస్యాద్య పాదే కార్యమ్ ।**
**శ్రవణాద్యపాదే విసర్జనం ॥**

పై ఆధారముల వలన మూలా నక్షత్రం మొదటి పాదములో పుస్తకరూపిణి, జ్ఞాన ప్రదాయిని అయిన సరస్వతీదేవిని ఆరాధించవలయును. మూలానక్షత్రం రాత్రి సమయంలో (సూర్యాస్తమయం తరువాత) ప్రారంభమయితే మరునాడు ఉదయం ఆచరించవలయును. అట్లుగాక సంగవకాలం నుండియే మూలా నక్షత్రం ఉండుట వలన మూలానక్షత్రం మొదటిపాదం ఉన్న దివి. 27-09-17 బుధవారం రోజుననే సర్వులూ శ్రీసరస్వతీదేవి ఆరాధన చేయవలయును.

## త్రిరాత్ర కలశస్థాపన నిర్ణయం

ది.వి. 26-09-2017 మంగళవారం ఆశ్వీయుజ శు॥షష్ఠి ౨౬-౨౫, (సా॥ **4-40**),
ది.వి. 27-09-2017 బుధవారం ఆశ్వీయుజ శు॥సప్తమి ౩౨-౩౫, (రా॥ **7-08**),
జ్యేష్ఠ ౯-౪౧, (ఉ॥ **9-58**),

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ ఆరభ్య పూజనం దేవ్యామూలబుక్షే సప్తమీ దినే ।**
**విధివచ్చైవ కర్తవ్యం యావద్వైష్ణవమృక్షకం ॥**
**మూలబుక్ష అసంభవే కేవల సప్తమ్యామేవ దేవీపూజనం కార్యం ।**
**అశ్విన శుక్లసప్తమ్యాం దేవీత్రిరాత్ర వ్రతారంభః॥ సాప్రదోషవ్యాపినీగ్రాహ్యా॥**

పై ఆధారముల వలన త్రిరాత్ర కలశస్థాపన మూలా నక్షత్రం ఉన్ననూ లేకపోయిననూ సప్తమితిథి యందు ఆచరించవలయును. సప్తమి ప్రదోష కాలమందు ఉండవలయును. సప్తమి ముందురోజు ప్రదోషంలో ఉన్ననూ మరునాడు ఉదయాస్తమయ ప్రదోష కాలముల లో ఉండటం, ప్రదోషంలో మూలానక్షత్ర సంయోగం ఉండటం వలన ది.వి 27-09-17 బుధవారం రోజుననే త్రిరాత్ర కలశస్థాపన చేయవలయును.

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## నాగచతుర్థి (నాగుల చవితి) నిర్ణయం

ది.వి.23-10-2017 సోమవారం కార్తీక శు॥చవితి ౬౦-౦, (**పూర్తి 24** గం॥),
ది.వి.24-10-2017 మంగళవారం కార్తీక శు॥చవితి ౨-౧౫, (**ఉ॥ 7-06**),
**ఈ విధముగా వచ్చుట వలన**

**శ్లో॥ మధ్యాహ్నే పూజయేత్ సర్పాన్ తస్యాం పుష్పాక్షతాదిభిః ।**
**నాగచతుర్థీ వినాయక చతుర్థీవత్ మధ్యాహ్న వ్యాపినీ గ్రాహ్యా ॥**
**శ్లో॥ దినద్వయేపి వర్తేత మధ్యాహ్నేచేత్ చతుర్థికా ।**
**తదాపూర్వైవ కర్తవ్యా నపరాతు కదాచన ॥**
**మాతృవిద్ధత్వ గుణస్యాధికత్వాత్ పూర్వైవ గ్రాహ్యా ॥**

పై ఆధారముల వలన చవితి రెండురోజులు ఉన్ననూ ముందురోజు మధ్యాహ్న వ్యాపినీత్వము, పూర్ణత్వ గుణాధిక్యము ఉండుట వలన ది.వి 23-10-17 సోమవారం రోజుననే వల్మీక పూజ, నాగచతుర్థీ వ్రతము ఆచరించవలయును.

## సుబ్రహ్మణ్య షష్ఠి (స్కంద షష్ఠి) నిర్ణయం

ది.వి.24-11-2017 శుక్రవారం మార్గశిర శు॥షష్ఠి ౬౦-౦, (**పూర్తి 24** గం॥),
ది.వి.25-11-2017 శనివారం మార్గశిర శు॥షష్ఠి ౩-౪౮, (**ఉ॥ 7-57**),
**ఈ విధముగా వచ్చుట వలన**

**శ్లో॥ యదా షష్ఠీ త్రిముహూర్త వ్యాపినీ భవతి తదా స్కందపూజనే పరా ।**
**నోచేత్ పూర్వైవ గ్రాహ్యా ॥**

పై ఆధారముల వలన షష్ఠి రెండురోజులు ఉన్ననూ ముందురోజు త్రిముహూర్త వ్యాపినీత్వము, గుణాధిక్యము ఉండుట వలన ది.వి 24-11-17 శుక్రవారం రోజుననే సుబ్రహ్మణ్య షష్ఠి వ్రతము ఆచరించవలయును.

## వైష్ణవ కృత్తికాదీపోత్సవ నిర్ణయం

ది.వి.02-12-2017 శనివారం మార్గశిర శు॥చతుర్దశి ౪౬-౬, (**రా॥ 12-57**),
భరణి ౧౪-౧, (**మ॥ 12-07**),
ది.వి.03-12-2017 ఆదివారం మార్గశిర శు॥పౌర్ణిమ ౩౬-౫౫, (**రా॥ 9-17**),
కృత్తిక ౭-౫, (**ఉ॥ 9-21**),
**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ చతుర్దశ్యాం విద్ధయాతు కృత్తికాదూషితో యది ।**
**పౌర్ణమాస్యాంతు రోహిణ్యాం కుర్యాదేతన్మహోత్సవం ॥**
**వృశ్చికమాస ప్రయుక్త కృత్తికా సహిత పౌర్ణమీ గృహీత్వా ॥**

పై ఆధారముల వలన వృశ్చిక మాసములో కృత్తికానక్షత్ర ప్రాధాన్యము గల దేవాలయాదుల యందు దివి. 02-12-17 శనివారం రోజున కృత్తికా దీపోత్సవములు ఆచరించవలయును. పై ఆధారముల వలన వృశ్చిక మాసములో పౌర్ణిమ తిథి ప్రాధాన్యము గల దేవాలయాదుల యందు దివి. 03-12-17 ఆదివారం రోజున కృత్తికా దీపోత్సవములు ఆచరించవలయును.

www.granthanidhi.blogspot.in

# శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

## పౌష్య మాస సంకష్ట హర చతుర్థి నిర్ణయం

ది.వి.04-01-2018 గురువారం పౌష్య బ॥తదియ ३८-४०, (**రా॥ 9-31**), చంద్రోదయం రా॥8-32
ది.వి.05-01-2018 శుక్రవారం పౌష్య బ॥చవితి ३०-३०, (**రా॥ 7-00**), చంద్రోదయం రా॥9-31

**ఈ విధముగా ఉండుట వలన**

**సంకష్టహర చతుర్థీ సా చంద్రోదయ వ్యాపినీ గ్రాహ్యా ॥**

**శ్లో॥ చంద్రోదయే యదా నస్యాద్యది వాపి దినద్వయే ।**
**ప్రదోష వ్యాపినీ గ్రాహ్యా చతుర్థీ సంకటవ్రతే ॥ ఇతి నారద పురాణే ॥**

పై ఆధారముల వలన సంకష్టహర చతుర్థీ వ్రతమును చంద్రోదయ సమయంలో బ॥చవితి ఏరోజు ఉంటుందో ఆరోజు ఆచరించవలయును.రెండురోజులలో చంద్రోదయ వ్యాపినీత్వము లేనప్పుడు ప్రదోష వ్యాపినీత్వము కలిగిన మరునాడే ఆచరించవలయును. దివి. 05-01-18 శుక్రవారం రోజుననే సంకష్టహరచతుర్థీ వ్రతమును ఆచరించవలయును.

## మాఘ శుద్ధ ఏకాదశి నిర్ణయం

ది.వి.27-01-2018 శనివారం మాఘ శు॥దశమి ००-००, (**ఉ॥ 11-14**).
ది.వి.28-01-2018 ఆదివారం మాఘ శు॥ఏకాదశి ४-३, (**ఉ॥ 8-27**).
ఉపరి శు॥ద్వాదశి ४२-८, (**రా॥తె॥ 5-17**).
ది.వి.29-01-2018 సోమవారం మాఘ శు॥త్రయోదశి ४३-४०, (**రా॥ 1-53**).

**శ్లో॥ ఏకాదశ్యుదయేత్కించిత్ పరేహ్ని ద్వాదశీ నచేత్ ।**
**త్యక్త్వా శుద్ధామపి స్మార్తైః కర్తవ్యా దశమీయుతా ॥**

పై ఆధారముల వలన **స్మార్తులు** ది.వి. 27-01-2018 న ఉపవసించి ది.వి. 28-01-2018 న పారణ చేయవలయును.

**మధ్వ, వైష్ణవులు** ది.వి. 28-01-2018 న ఉపవసించి ది.వి. 29-01-2018 న పారణ చేయవలయును.

## మహాశివరాత్రి నిర్ణయం

ది.వి.13-02-2018 మంగళవారం మాఘ బ॥త్రయోదశి ३८-३३, (**రా॥ 10-34**),
ది.వి.14-02-2018 బుధవారం మాఘ బ॥చతుర్దశి ४४-४, (**రా॥ 12-46**),

**ఈ విధముగా ఉండుట వలన**

**శ్లో॥ మాఘ కృష్ణ చతుర్దశ్యాం ఆదిదేవో మహానిశి ।**
**శివలింగ తయోద్భూతః కోటి సూర్యసమప్రభః ॥**

**కృష్ణపక్షే భవేద్యాతు మాఘమాసే చతుర్దశీ । శివరాత్రి రితిప్రోక్తా మహాపాతకనాశినీ । యద్యర్ధరాత్ర పర్యన్తం భవేచ్ఛివ చతుర్దశీ ॥ అస్యామేవ మహాశివరాత్రిః । సాఽర్ధరాత్ర వ్యాపినీ గ్రాహ్యా ॥ ప్రతిమాసేపి కర్తవ్యా కృష్ణపక్షే చతుర్దశీ । ప్రదోష వ్యాపినీ చైవ పూర్వావా యదివా పరా**

## శ్రీ హేమలంబ నామ సం॥ పండుగల నిర్ణయం

పై ఆధారముల వలన మహాశివరాత్రి పర్వదినమునకు అర్ధరాత్రి కాలమునకు చతుర్దశి ఉండవలయును, ముందురోజు అర్ధరాత్రి వ్యాపినీత్వము కలిగిననూ మరునాడు ప్రదోష, అర్ధరాత్రి వ్యాపినీత్వము కలిగి ఉండుట వలన సంపూర్ణ గుణాధిక్యము ఉండుట వలన దివి. 14-02-18 బుధవారం రోజుననే సర్వులూ మహాశివరాత్రి పర్వదినమును ఆచరించవలయును.

**లింగోద్భవకాలము రా॥ 12గం॥26ని॥58సె॥ నుండి 12గం॥33ని॥31సె॥ వరకు.**

## సంవత్సర నామ నిర్ణయం

ఇప్పటి తెలుగు (చాంద్రమాన) , తమిళ (సౌరమాన) వత్సరాదిని కొన్నికొన్ని ప్రాంతములలో **1**. హేమలంబ **2**. హేమలంబి **3**. హేవళంబ **4**. హేవళంబి **5**. హేవిళంబి **6**. ఏవళంబి. అని ఇలా పలు పలు రకములుగా వాడుకలో పిలుస్తూ ఉన్నారు. కానీ అసలైన పదమేమిటి, సంకల్పమునకు ఏమి చెప్పాలి అని ప్రామాణికమైన గ్రంధములను పరిశీలిస్తే

శ్లో॥ **హేమలంబో విలంబోథ వికారీ శార్వరీ ప్లవః** ॥ నిర్ణయసింధు (పేజీ 2),

భగవంత భాస్కరః సమయమయూఖ (పేజీ 174), నారదసంహిత (పేజీ 41), దైవజ్ఞ రంజనమ్ (పేజీ 46), పంచాంగపీఠిక (పేజీ 25), దైవజ్ఞ కర్ణామృతం (పేజీ56).

శ్లో॥ **హేమలంబేన సంపదః ..**॥ అగ్నిపురాణం, 139వ అధ్యా. 9వ శ్లో. (పేజీ 389),

శ్లో॥ **దుర్ముఖస్తదనుప్రోక్తో హేమలంబక సంజ్ఞకః** ॥ జ్యోతిర్విదాభరణం (పేజీ 53),

శ్లో॥ **హేమలంబ ఇతి సప్తమే యుగే స్యాత్** ॥ బృహత్సంహిత, 8వఅధ్యా.39వశ్లో. (పేజీ 77),

శ్లో॥ **హేమలంబో నృపాస్సర్వే పరస్పర విరోధినః** ॥ నారదసంహిత (పేజీ 48),

శ్లో॥ **సప్తమీ హేమలంబాఖ్యే....** ॥ చతుర్వర్గ చింతామణి, వ్రతఖండ (పేజీ 213),

శ్లో॥ **ధరామరాగోకుల రాజబృందాధర్మ ప్రసక్తా ఖలు హేమలంబే ।**
**సీదంతి సర్వే విరలార్ఘ సస్యైరవృష్టిభిః క్షుద్భయ పీడితాశ్చ** ॥ పంచాంగపీఠిక,

శ్లో॥ **ఆదిత్యం తేజసాం స్థానం హేమలంబ కృతాహ్వయమ్ ।**
**సప్త సప్తి సమారూఢం జగతాం నేత్రమాశ్రయే** ॥ శాన్తి కమలాకరం(పేజీ 672),

శ్లో॥ **హేమలంబో నృపాస్సర్వే పరస్పర విరోధినః ।**
**ప్రజాపీడాత్వనర్ఘస్యాత్ తథాపి సుఖినో జనాః** ॥ పంచాంగసరళి, సిద్ధాంత సరళి.

శ్లో॥ **విమోహినీ హేమలంబే పీతవర్ణా మృగాసనా** ॥ వీరమిత్రోదయః పూజాప్రకాశ (పేజీ358),

పై ప్రామాణిక గ్రంధముల ఆధారముల వలన **హేమలంబ** అనే పదమే సరి అయినది అని 08-08-16 రోజున విజయవాడ లబ్బీపేట లో జరిగిన విద్వత్సభలో నిర్ణయిండమైనది.

శ్లో॥ **శుక్రః పంచసహస్రాణి బుధః పంచ శతానిచ !**
**లక్షమేకంతు దోషాణాం గురుః కేంద్రో వ్యపోహతి !!**

కేంద్రస్థానములైన 4,7,10 స్థానములందు శుక్రుడున్న 5వేల దోషములను, బుధుడున్న 5వందల దోషములను, గురుడున్న లక్షదోషములను తొలగించును.

శ్లో॥ **లగ్నస్థో భార్గవో జీవో యదివా చంద్రనందనః !**
**నాశయద్యఖిలాన్ దోషాన్ తూలసంఘ మివానలః !!**

లగ్నమందు గురు శుక్ర బుధులున్న యెడల సకలదోషములనూ హరించును.

శ్లో॥ **లగ్నైకాదశగో రవిశ్చ సకలాన్ దోషాన్నిహంత్యేవతాన్ !!**

పదకొండవ స్థానమందు రవి ఉన్నయెడల సకలదోషములనూ హరించును.

శ్లో॥ **కుజాష్టమదోషం భృగుషట్కదోషం వధూవరౌ అష్టమలగ్నదోషం !**
**గండాదిదోషం కుళికాది దోషం సర్వం నిహంతి త్రిషడాయగేరవౌ !!**

కుజాష్టమదోషం, భృగుషట్కదోషం, వధూవరుల అష్టమలగ్నదోషం, గండాది దోషం, కుళికాది దోషములను రవి లగ్నాదిగా 3,6,11 స్థానములలో ఉన్నప్పుడు పూర్తిగా తొలగించును.

శ్లో॥ **జామిత్ర దోషం గుళికాది దోషం వధూవరౌ అష్టమలగ్నదోషం !**
**గండంతు దోషం దుర్మూహూర్త దోషం నిహంతి త్రిషడాయగేరవౌ !!**

జామిత్ర దోషం, గుళికాది దోషం, వధూవరుల అష్టమ లగ్నదోషం, దుర్మూహూర్త దోషం, గండాది దోషములను రవి లగ్నాదిగా 3,6,11 స్థానములలో ఉన్నప్పుడు పూర్తిగా తొలగించును.

శ్లో॥ **అస్తగే నీచగే భౌమే శతృక్షేత్ర గతోపివా !**
**కుజాష్టమోద్భవేదోషా నకించిదపి విద్యతే !!**

కుజుడు అస్తంగతుడై రవితో కలసి ఉన్ననూ, నీచస్థానమందు, శతృస్థానమందు ఉన్ననూ కుజాష్టమ దోషము తొలగును.

శ్లో॥ **ఏకస్మిన్ కేంద్రగే జీవే శుక్రేవా పాపకేంద్రజాః !**
**దోషావినాశమాయాంతి పాపం భాగీరథీ జలాత్ !!**

గురు శుక్రులలో ఎవరైననూ కేంద్రగతులైనప్పుడు క్రూరగ్రహములు కేంద్ర స్థానమునందుండు దోషములు తొలగును.

శ్లో॥ **నక్షత్రదోషం తిథివారదోషం లగ్నాదిదోషం చ ముహూర్త దోషం !**
**పాతాదిదోషం బహుజన్మదోషం జ్వాలాముఖీచ విషనాడికానాం !**
**ఏతాని దోషాని వినాశయంతి సర్వత్రదోషం గురుశుక్రలగ్నే !**

దుష్ట గ్రహ సంచార నక్షత్ర, తిథి, వార, లగ్న, దుర్మూహూర్త, పాతాది దోషములు గురు శుక్రులు లగ్నమందుండిన తొలగిపోవును.

శ్లో॥ **వివాహేషుచ దేవానాం ప్రతిష్ఠాసూపనయనే !**
**ఛాయాగ్రహేతు విజ్ఞేయౌ రాహుకేతూ నదోషదౌ !!**

వివాహ శుభకార్యక్రమములయందు, దేవతా ప్రతిష్ఠ, ఉపనయనాదుల యందు లగ్నస్థిత రాహుకేతు దోషము లేదని శాస్త్రవచనం.

శ్లో॥ **అభిషేకే నిషేకేచ ప్రవేశే వ్రతబంధనే !**

www.granthanidhi.blogspot.in

**పాణిగ్రహే ప్రయాణేచ చంద్రే ద్వాదశగే శుభే !!**

అభిషేకమునకు, నిషేకమునకు, వ్రతప్రారంభములకు, ప్రవేశమునకు, ఉపనయన, వివాహ, ప్రయాణముల యందు ద్వాదశ చంద్ర దోషము లేదని శాస్త్రవచనం.

శ్లో॥ **ఏకరాశిగతోవాపి నక్షత్రాంతర్గత శ్శశీః !**
**యదిచేత్సగ్రహభయం నాస్తీతి ధృఢనిశ్చయః !!**

శ్లో॥ **గురుస్స్వకీయ వర్గస్థో బలవా స్కంటకాశ్రితః !**
**పశ్యంత్సగ్రహశీతాంశుం తద్దోషం విలయం వ్రజేత్ !!**

చంద్రుడు ఇతర గ్రహములతో కలసి ఏకరాశిలో ఉన్నప్పటికీ నక్షత్రభేదము ఉన్నయెడల సగ్రహచంద్ర దోషము లేదని శాస్త్రవచనం. గురువు స్వ వర్గమందుగానీ, స్వాంశయందుగానీ, కేంద్రమందుగానీ బలవంతుడై ఉండి ఇతర గ్రహములతో కూడిన చంద్రుని చూస్తున్నయెడల సగ్రహచంద్ర దోషము లేదని శాస్త్రవచనం.

**మౌఢ్య సమయమున వివాహాది ముహూర్త విషయం ః-**

శ్లో॥ **ఏకోమూఢో భవేదస్య స్వోచ్ఛమిత్రాంశగో యది !**
**స్వరాశిమూర్తిగశ్చైవ మౌఢ్య దోషో నవిద్యతే !!**

శ్లో॥ **గురోరస్తంగతో దోషో నాస్తి శుక్రోదయో యది !**
**ద్వయో రస్తమయస్స్యాచ్చేత్ అపవాదైర్నభిద్యతే !!**

గురు శుక్రమౌఢ్యమిలలో వివాహాది శుభకార్యక్రమములు పూర్తిగా నిషిద్ధమని శాస్త్రవచనం.కానీ ప్రస్తుత కాలములో కొంతమంది పై శ్లోకములను ఆధారముగా చూపి **ఏకవింశతి మహాదోషములలో కూడా మౌఢ్యదోషము లేదని** మరియూ ఒకరి మౌఢ్యమిలో మరియొకరు ఉచ్ఛ, మిత్ర, స్వక్షేత్ర అంశలను పొందిన మౌఢ్యదోషములేదని, ఒకరు అస్తమించినప్పుడు వేరొకరు పూర్తి బలముగా ఉన్న శుభకార్యక్రమములు చేయవచ్చని చెప్పుచుంటిరి. **కానీ ఈవిషయము ఆపత్కాల విషయముగా** అనగా మారణాది విపత్తులు దగ్గర్లో ఉన్నప్పుడు పరిగణించవలయును, కానీ సామాన్య సమయమున కాదు. గురుశుక్రమౌఢ్యమిలలో వివాహము చేసిన సంతానహీనత లేక వైధవ్యం ప్రాప్తించునని శాస్త్రవచనం.

**మీన చైత్రమున వివాహాది ముహూర్త విషయం ః-**

శ్లో॥ **ముండనం మీనచైత్రేతు మండనం మేషచైత్రకే !**
**ముండనం మండనం చైవ మేష చైత్రే విధీయతే !!**

మీనరవి చైత్రమాసంలో ఉపనయనమును, మేషరవి చైత్రమాసంలో వివాహమును చేయవచ్చును, విశేషించి మేషరవి చైత్రమాసంలో ఉపనయన,వివాహమును చేయవచ్చును.

శ్లో॥ **మీన చైత్రో ధనుఃపుష్యో మిధునాషాఢకోపిచ !**
**కన్యా భాద్రపదో మాసః శూన్యమాసాః ప్రకీర్తితాః !!**
**వింధ్యస్య దక్షిణ దేశానాం మీనచైత్రం నదోషకృత్ !!**

మీనరవి చైత్రమాసంలో, ధనుస్సురవి పుష్యమాసములో, మిధునరవి ఆషాఢమాసములో, కన్యరవి భాద్రపదమాసములు శూన్యమాసములు అట్టి సమయమున శుభకార్యక్రమములు చేయకూడదు.

శ్రీశైలమునకు వింధ్యకు మధ్యప్రాంతీయులైన దక్షిణ దేశస్థులకు మీనచైత్ర దోషముండదు కనుక యథావిధిగా ఆప్రాంతమువారు వివాహాది శుభకార్యక్రమములు జరుపుకోవచ్చును.

www.granthanidhi.blogspot.in

| **27 నక్షత్రములవారికి శుభకార్యక్రమముల యందు తారాబలము కలిగిన నక్షత్రముల వివరణ** | |
|---|---|
| **1. అశ్విని** | రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ,మూల, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి. |
| **2. భరణి** | మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని. |
| **3. కృత్తిక** | రోహిణి, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని. |
| **4. రోహిణి** | మృగశిర, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, రేవతి. |
| **5. మృగశిర** | పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని,రోహిణి. |
| **6. ఆర్ద్రా** | పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ, శతతార, రేవతి, రోహిణి, మృగశిర. |
| **7. పునర్వసు** | పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర. |
| **8. పుష్యమి** | హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు. |
| **9. ఆశ్రేష** | మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి. |
| **10. మఖ** | హస్త, స్వాతి, అనూరాధ, మూల, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, రోహిణి, పుష్యమి. |
| **11. పుబ్బ** | ఉత్తర, చిత్త, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, మఖ. |
| **12. ఉత్తర** | హస్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ. |
| **13. హస్త** | చిత్త, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర. |
| **14. చిత్త** | స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని,రోహిణి, మృగశిర, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త. |
| **15. స్వాతి** | శ్రవణం, ధనిష్ఠ, శతతార, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త. |
| **16. విశాఖ** | అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి. |

www.granthanidhi.blogspot.in

| | |
|---|---|
| **17. అనూరాధ** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి. |
| **18. జ్యేష్ఠ** | మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ. |
| **19. మూల** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, రేవతి, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ, హస్త, స్వాతి, అనూరాధ. |
| **20. పూర్వాషాఢ** | ఉత్తరాషాఢ, ధనిష్ఠ, రేవతి, అశ్విని, మృగశిర, పునర్వసు, మఖ, ఉత్తర, చిత్త, మూల. |
| **21. ఉత్తరాషాఢ** | శ్రవణం, శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, స్వాతి, అనూరాధ, మూల. |
| **22. శ్రవణం** | ధనిష్ఠ, రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, ఉత్తర, హస్త, చిత్త, ఉత్తరాషాఢ. |
| **23. ధనిష్ఠ** | శతతార, ఉత్తరాభాద్ర, అశ్విని, రోహిణి, మృగశిర, పుష్యమి, మఖ, ఉత్తర, హస్త, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, శ్రవణం. |
| **24. శతతార** | రేవతి, రోహిణి, మృగశిర, పునర్వసు, హస్త, చిత్త, స్వాతి, శ్రవణం, ధనిష్ఠ. |
| **25. పూర్వాభాద్ర** | ఉత్తరాభాద్ర, అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, స్వాతి, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, శతతార. |
| **26. ఉత్తరాభాద్ర** | రేవతి, రోహిణి, పునర్వసు, పుష్యమి, హస్త, స్వాతి, అనూరాధ, శ్రవణం, శతతార. |
| **27. రేవతి** | అశ్విని, మృగశిర, పునర్వసు, పుష్యమి, మఖ, ఉత్తర, చిత్త, అనూరాధ, మూల, ఉత్తరాషాఢ, ధనిష్ఠ, ఉత్తరాభాద్ర. |

**శ్లో॥ ప్రథమే ప్రథమం త్యాజ్యం ద్వితీయేతు తృతీయకం !**
**తృతీయే పంచమం త్యాజ్యం నైధనం సర్వత్ర వర్జయేత్ !!**

**జన్మనక్షత్రమందు చేయుదగినవి :-** నిషేకము, చౌలము, త్యాగము, అన్నప్రాశనము, వ్యవసాయము, ఉపనయనము, అక్షరాభ్యాసము, పట్టాభిషేకము చేయవచ్చును. స్త్రీలకు వివాహం శ్రేష్టం కాని **జన్మతారయందు** కాకుండా **అనుజన్మతారయందు** చేసిన శ్రేష్ఠం

**జన్మ నక్షత్రమందు చేయగూడనవి :-** గర్భాదానము,వివాహం,పుంసవనము,సీమంతము, ప్రయాణం,ఔషధ,సేవ,క్షౌరం చేయకూడదు.

**శ్లో॥ వివాహోత్సవాది కార్యాణి స్వపితుర్భాగ్యభాక్కాలే !**
**కర్మ నక్షత్ర (అనుజన్మతార) కాలే శుభం నిత్యం మహత్ !! ॥ దేవకేరళం ॥**

పై ఆధారమువలన జన్మ నక్షత్రమందు కాక అనుజన్మ నక్షత్రముల యందు (అనుజన్మతారల యందు) స్త్రీపురుషులిరువురూ శుభకార్యక్రమములు చేసుకొనవచ్చును.

www.granthanidhi.blogspot.in

## పంచక రహిత వివరము

**1. పంచక రహితం :-**

**శ్లో॥ తిథిరోడుబిర్యుక్తం తత్కాలోదయ మిశ్రితం !**
**నవభిస్తు హరేర్భాగం శేషం పంచకమీరితమ్ !!**

తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1 వచ్చిన మృత్యుపంచకం, శేషం 2 వచ్చిన అగ్నిపంచకం, శేషం 4 వచ్చిన రాజపంచకం, శేషం 6 వచ్చిన చోరపంచకం, శేషం 8 వచ్చిన రోగపంచకం మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో పంచకరహితమైనది, శుభప్రదమని భావించవలయును.

**2. మార్తాండపంచక రహితం :-**

**శ్లో॥ గతతిథి సంయుక్తం తత్కాలోదయ మిశ్రితం !**
**నవభిస్తు హరేర్భాగం శేషం మార్తాండమీరితమ్ !!**

గతతిథి, తాత్కాలిక లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం **3,5,7,9** వచ్చినచో మార్తాండపంచకరహితమైనది, శుభప్రదమని భావించవలయును.

**3. ధృవక రహితం :- 1 వ పద్ధతి**

**శ్లో॥ శృతిః బాణః ఋతుః పంచ వేద త్రీణి ద్వి చంద్రమాః !**
**గగనేందు ద్వయం త్రీణి ధృవకంచే త్యనుక్రమాత్ !!**

మేషమునకు **4,** వృషభమునకు **5,** మిథునమునకు **6,** కర్కాటకమునకు **5,** సింహమునకు **4,** కన్యకు **3,** తులకు **2,** వృశ్చికమునకు **1,** ధనస్సునకు **0,** మకరమునకు **1,** కుంభమునకు **2,** మీనమునకు **3,**

**ఈవిధముగా చెప్పబడిన సంఖ్యను మరియూ** తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1,2,4,6,8 వచ్చిన పంచకశుద్ధి కాలేదని మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనది భావించవలయును.

**4. ధృవక రహితం :- 2 వ పద్ధతి**

**శ్లో॥ వసు శైల పురారంధ్ర గజ వేదార్క శైలయోః !**
**నాగాబ్ధి వసునేత్రాణాం మేషాద్యాదనుక్రమాత్ !!**

మేషమునకు **8,** వృషభమునకు **7,** మిథునమునకు **3,** కర్కాటకమునకు **8,** సింహమునకు **8,** కన్యకు **4,** తులకు **12,** వృశ్చికమునకు **7,** ధనస్సునకు **8,** మకరమునకు **4,** కుంభమునకు **8,** మీనమునకు **2,**

**ఈవిధముగా చెప్పబడిన సంఖ్యను మరియూ** తిథి, వార, నక్షత్ర,లగ్న సంఖ్యలను కలిపి 9చే భాగించగా శేషం 1,2,4,6,8 వచ్చిన పంచకశుద్ధి కాలేదని మిగిలిన **3,5,7,9** శేషం వచ్చినచో ధృవకపంచకరహితమైనది భావించవలయును.

రాజసేవకు రాజపంచకం, ప్రయాణమునకు చోరపంచకం, వివాహ ఉపనయనములకు రోగ, మృత్యు పంచకములు పనికిరావు. ఈ విషయమున బహుపాఠాంతరములు కలవు.

www.granthanidhi.blogspot.in

॥శ్రీ లక్ష్మీ గణపతయేనమః॥ ॥శ్రీలలితాత్రిపుర సుందర్యై నమః॥ ॥శ్రీ దక్షిణామూర్తయే నమః॥





# శ్రీ హేమలంబ నామ సంవత్సరంలో
# వివాహాది ముహూర్తముల పట్టిక

## "ప్రమాదో ధీమతామపి"

**ముహూర్తములను నిర్ణయించుకొనే ముందు పంచాంగ పీఠిక యందు సరి చూసుకొనగలరు.**

పుష్కర, శుభ, వర్గోత్తమాంశ వివరాదులను గమనించగలరు.పంచక రహిత పద్ధతుల వివరాదులను పక్కపేజీలో పరిశీలించగలరు.

**స్వల్ప దోషం గుణాధిక్యం అను వాక్యానుసారం ముహూర్తములను నిర్ణయించడం జరిగినది.**



## చైత్ర మాసం 28-03-2017 మంగళ నుండి 26-04-2017 బుధ వరకు

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **07.4.17** | శుక్ర | శు॥ ద్వాదశి | మఖ | వృషభం | ఉ. 10-06 | పంచక | శుభ | వివాహం. |
| **07.4.17** | శుక్ర | శు॥ ద్వాదశి | మఖ | వృశ్చికం | రా. 09-28 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **08.4.17** | శని | శు॥ త్రయోదశి | ఉత్తర | మకరం | రా. 02-05 | ధృవక | పుష్కర | వివాహం. |
| **08.4.17** | శని | శు॥ త్రయోదశి | ఉత్తర | కుంభం | రా.తె.4-23 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం గృహప్రవేశం. |
| **09.4.17** | ఆది | శు॥ చతుర్దశి | ఉత్తర | వృశ్చికం | రా. 09-20 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **09.4.17** | ఆది | శు॥ చతుర్దశి | హస్త | మకరం | రా. 02-01 | ధృవక | పుష్కర | వివాహం. |
| **09.4.17** | ఆది | శు॥ చతుర్దశి | హస్త | కుంభం | రా.తె.4-19 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం. |
| **10.4.17** | సోమ | శు॥ చతుర్దశి | హస్త | వృషభం | ఉ. 08-55 | ధృవక | పుష్కర | గృహారంభం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **10.4.17** | సోమ | శు॥ పౌర్ణిమ | హస్త | వృశ్చికం | రా. 09-15 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **12.4.17** | బుధ | బ॥ పాడ్యమి | స్వాతి | వృషభం | ఉ. 08-48 | పక్షధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ. |



www.granthanidhi.blogspot.in

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **12.4.17** | బుధ | బ॥ విదియ | స్వాతి | వృశ్చికం | రా. 09-08 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **12.4.17** | బుధ | బ॥ విదియ | స్వాతి | మకరం | రా. 01-50 | ధృవక | పుష్కర | వివాహం. |
| **12.4.17** | బుధ | బ॥ విదియ | స్వాతి | కుంభం | రా.తె.4-07 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **14.4.17** | శుక్ర | బ॥ చవితి | అనూరాధ | మకరం | రా. 01-43 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **14.4.17** | శుక్ర | బ॥ చవితి | అనూరాధ | కుంభం | రా.తె.4-01 | పక్షమార్తా | పుష్కర | వివాహం. |
| **16.4.17** | ఆది | బ॥ షష్ఠి | మూల | మకరం | రా. 01-35 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **16.4.17** | ఆది | బ॥ షష్ఠి | మూల | కుంభం | రా.తె.3-53 | పంచక | పుష్కర | వివాహం. |
| **16.4.17** | ఆది | బ॥ షష్ఠి | మూల | మీనం | రా.తె.4-35 | పక్షధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **19.4.17** | బుధ | బ॥ అష్టమి | శ్రవణం | మకరం | రా. 01-23 | పంచక | పుష్కర | వివాహం. |
| **19.4.17** | బుధ | బ॥ అష్టమి | శ్రవణం | కుంభం | రా.తె.3-41 | పక్షక | పుష్కర | వివాహం. |
| **19.4.17** | బుధ | బ॥ నవమి | శ్రవణం | మీనం | రా.తె.4-23 | పక్షధృవక | పుష్కర | వివాహం. |
| **20.4.17** | గురు | బ॥ నవమి | శ్రవణం | కర్కాటకం | మ. 11-40 | మార్తాండ | వర్గో | ప్రతిష్ఠ, శుభాదులు. |
| **20.4.17** | గురు | బ॥ నవమి | శ్రవణం | మకరం | రా. 01-20 | పంచక | పుష్కర | వివాహం. |
| **20.4.17** | గురు | బ॥ నవమి | ధనిష్ఠ | కుంభం | రా.తె.3-38 | పంచక | పుష్కర | వివాహం. |
| **20.4.17** | గురు | బ॥ నవమి | ధనిష్ఠ | మీనం | రా.తె.4-20 | ధృవక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **21.4.17** | శుక్ర | బ॥ దశమి | ధనిష్ఠ | కర్కాటకం | మ. 11-59 | పక్షక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **21.4.17** | శుక్ర | బ॥ దశమి | ధనిష్ఠ | మకరం | రా. 01-15 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **21.4.17** | శుక్ర | బ॥ దశమి | శతతార | కుంభం | రా.తె.3-33 | పంచక | పుష్కర | వివాహం. |
| **21.4.17** | శుక్ర | బ॥ దశమి | శతతార | మీనం | రా.తె.4-15 | పక్షక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **22.4.17** | శని | బ॥ ఏకాదశి | శతతార | కర్కాటకం | ఉ. 11-55 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **22.4.17** | శని | బ॥ ఏకాదశి | శతతార | మకరం | రా. 01-11 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |



www.granthanidhi.blogspot.in

## వైశాఖ మాసం 27-04-2017 గురు నుండి 25-05-2017 గురు వరకు

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **28.4.17** | శుక్ర | శు॥ తదియ | రోహిణి | మకరం | రా. 12-47 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **29.4.17** | శని | శు॥ చవితి | మృగశిర | కర్కాటకం | ఉ. 11-28 | మార్తాండ | పుష్కర | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **29.4.17** | శని | శు॥ చవితి | మృగశిర | మకరం | రా. 12-44 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **29.4.17** | శని | శు॥ చవితి | మృగశిర | మీనం | రా.తె. 3-44 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **01.5.17** | సోమ | శు॥ షష్ఠి | పునర్వసు | కర్కాటకం | ఉ. 11-19 | మార్తాండ | పుష్కర | శుభాదులు. |
| **04.5.17** | గురు | శు॥ నవమి | మఖ | కర్కాటకం | ఉ. 11-57 | మార్తాండ | శుభ | వివాహం. |
| **04.5.17** | గురు | శు॥ దశమి | మఖ | మకరం | రా. 12-23 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **04.5.17** | గురు | శు॥ దశమి | మఖ | మీనం | రా.తె. 3-23 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **06.5.17** | శని | శు॥ ఏకాదశి | ఉత్తర | కర్కాటకం | ఉ. 11-00 | పంచక | పుష్కర | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. |
| **06.5.17** | శని | శు॥ ద్వాదశి | ఉత్తర | మకరం | రా. 12-15 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **06.5.17** | శని | శు॥ ద్వాదశి | ఉత్తర | మీనం | రా.తె. 3-16 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **07.5.17** | ఆది | శు॥ ద్వాదశి | హస్త | కర్కాటకం | ఉ. 10-56 | పంచక | పుష్కర | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. |
| **07.5.17** | ఆది | శు॥ త్రయోదశి | హస్త | మకరం | రా. 12-11 | ధృవక | పుష్కర | వివాహం. |
| **07.5.17** | ఆది | శు॥ త్రయోదశి | హస్త | మీనం | రా.తె. 3-12 | పంచక | పుష్కర | వివాహం. |
| **08.5.17** | సోమ | శు॥ త్రయోదశి | చిత్త | కర్కాటకం | ఉ. 10-52 | మార్తాండ | పుష్కర | ఉపనయనం, ప్రతిష్ఠ. |
| **08.5.17** | సోమ | శు॥ చతుర్దశి | చిత్త | మకరం | రా. 12-07 | మార్తాండ | పుష్కర | శుభాదులు. |
| **10.5.17** | బుధ | శు॥ పౌర్ణిమ | స్వాతి | కర్కాటకం | ఉ. 10-44 | మార్తాండ | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు. |
| **11.5.17** | గురు | బ॥ పాడ్యమి | అనూరాధ | మీనం | రా.తె. 2-56 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **12.5.17** | శుక్ర | బ॥ విదియ | అనూరాధ | కర్కాటకం | ఉ. 10-36 | ధృవక | పుష్కర | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. |
| **13.5.17** | శని | బ॥ తదియ | మూల | మీనం | రా.తె. 2-48 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **14.5.17** | ఆది | బ॥ తదియ | మూల | కర్కాటకం | ఉ. 10-28 | పక్షక | పుష్కర | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. |



www.granthanidhi.blogspot.in

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **17.5.17** | బుధ | బ॥ షష్ఠి | శ్రవణం | కర్కాటకం | ఉ. 10-17 | పక్షక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. |
| **17.5.17** | బుధ | బ॥ సప్తమి | శ్రవణం | మకరం | రా. 11-32 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **17.5.17** | బుధ | బ॥ సప్తమి | శ్రవణం | మీనం | రా. 02-32 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **17.5.17** | బుధ | బ॥ సప్తమి | శ్రవణం | మేషం | రా.తె.4-58 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **18.5.17** | గురు | బ॥ అష్టమి | ధనిష్ఠ | మకరం | రా. 11-28 | పంచక | పుష్కర | వివాహం. |
| **18.5.17** | గురు | బ॥ అష్టమి | ధనిష్ఠ | మీనం | రా. 02-28 | పంచక | పుష్కర | వివాహం. |
| **18.5.17** | గురు | బ॥ అష్టమి | ధనిష్ఠ | మేషం | రా.తె.4-54 | పంచక | పుష్కర | వివాహం. |
| **19.5.17** | శుక్ర | బ॥ నవమి | శతతార | మకరం | రా. 11-23 | ధృవక | పుష్కర | వివాహం. |
| **19.5.17** | శుక్ర | బ॥ నవమి | శతతార | మీనం | రా. 02-23 | పంచక | పుష్కర | వివాహం. |
| **19.5.17** | శుక్ర | బ॥ నవమి | శతతార | మేషం | రా.తె.4-49 | ధృవక | పుష్కర | వివాహం. |
| **20.5.17** | శని | బ॥ నవమి | శతతార | కర్కాటకం | ఉ. 10-04 | పంచక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. |
| **21.5.17** | ఆది | బ॥ ఏకాదశి | ఉ॥భాద్ర | మకరం | రా. 11-16 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **21.5.17** | ఆది | బ॥ ఏకాదశి | ఉ॥భాద్ర | మీనం | రా. 02-16 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **21.5.17** | ఆది | బ॥ ఏకాదశి | ఉ॥భాద్ర | మేషం | రా.తె.4-42 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **22.5.17** | సోమ | బ॥ ఏకాదశి | ఉ॥భాద్ర | కర్కాటకం | ఉ. 09-57 | పంచక | పుష్కర | ప్రతిష్ఠ, శుభాదులు. |
| **జ్యేష్ఠ మాసం 26-05-2017 శుక్ర నుండి 24-06-2017 శని వరకు** | | | | | | | | |
| **26.5.17** | శుక్ర | శు॥ పాడ్యమి | రోహిణి | కర్కాటకం | ఉ. 09-40 | ధృవక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **26.5.17** | శుక్ర | శు॥ విదియ | మృగశిర | మేషం | రా.తె.4-21 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **27.5.17** | శని | శు॥ విదియ | మృగశిర | కర్కాటకం | ఉ. 09-36 | పంచక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **28.5.17** | ఆది | శు॥ చవితి | పునర్వసు | మకరం | రా. 10-47 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **29.5.17** | సోమ | శు॥ చవితి | పునర్వసు | కర్కాటకం | ఉ. 09-28 | మార్తాండ | పుష్కర | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **31.5.17** | బుధ | శు॥ సప్తమి | మఖ | మకరం | రా. 10-35 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **31.5.17** | బుధ | శు॥ సప్తమి | మఖ | మీనం | రా. 01-35 | పంచక | పుష్కర | వివాహం. |
| **31.5.17** | బుధ | శు॥ సప్తమి | మఖ | మేషం | రా.తె.4-01 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **01.6.17** | గురు | శు॥ అష్టమి | మఖ | కర్కాటకం | ఉ. 09-16 | పంచక | పుష్కర | వివాహం. |



www.granthanidhi.blogspot.in

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **02.6.17** | శుక్ర | శు॥ నవమి | ఉత్తర | మకరం | రా. 10-27 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **02.6.17** | శుక్ర | శు॥ నవమి | ఉత్తర | మీనం | రా. 01-27 | పంచక | పుష్కర | వివాహం. |
| **02.6.17** | శుక్ర | శు॥ నవమి | ఉత్తర | మేషం | రా.తె.3-53 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **03.6.17** | శని | శు॥ దశమి | ఉత్తర | కర్కాటకం | ఉ. 09-09 | ధృవక | పుష్కర | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **03.6.17** | శని | శు॥ దశమి | హస్త | మకరం | రా. 09-38 | ధృవక | వర్గో | వివాహం. |
| **03.6.17** | శని | శు॥ దశమి | హస్త | మీనం | రా. 01-24 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **03.6.17** | శని | శు॥ దశమి | హస్త | మేషం | రా.తె.3-50 | ధృవక | పుష్కర | వివాహం. |
| **04.6.17** | ఆది | శు॥ ఏకాదశి | హస్త | కర్కాటకం | ఉ. 09-05 | మార్తాండ | పుష్కర | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **04.6.17** | ఆది | శు॥ ఏకాదశి | చిత్త | మకరం | రా. 10-20 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **04.6.17** | ఆది | శు॥ ఏకాదశి | చిత్త | మేషం | రా.తె.3-46 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **05.6.17** | సోమ | శు॥ ఏకాదశి | చిత్త | కర్కాటకం | ఉ. 09-01 | మార్తాండ | పుష్కర | ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **07.6.17** | బుధ | శు॥ చతుర్దశి | అనూరాధ | మీనం | రా. 01-09 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **07.6.17** | బుధ | శు॥ చతుర్దశి | అనూరాధ | మేషం | రా.తె.2-28 | పంచక | వర్గో | వివాహం, గృహప్రవేశం. |
| **08.6.17** | గురు | శు॥ చతుర్దశి | అనూరాధ | కర్కాటకం | ఉ. 08-50 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **08.6.17** | గురు | శు॥ పౌర్ణమి | అనూరాధ | మకరం | రా. 10-05 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **08.6.17** | గురు | శు॥ పౌర్ణమి | అనూరాధ | మీనం | రా. 01-05 | ధృవక | పుష్కర | వివాహం. |
| **10.6.17** | శని | బ॥ పాడ్యమి | మూల | కర్కాటకం | ఉ. 08-42 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **10.6.17** | శని | బ॥ విదియ | మూల | మకరం | రా. 09-57 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **10.6.17** | శని | బ॥ విదియ | మూల | మీనం | రా. 12-57 | ధృవక | పుష్కర | వివాహం. |
| **10.6.17** | శని | బ॥ విదియ | మూల | మేషం | రా.తె.3-23 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **15.6.17** | గురు | బ॥ షష్ఠి | ధనిష్ఠ | కర్కాటకం | ఉ. 08-24 | పక్షమార్తా | పుష్కర | వివాహం, ఉపనయనం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **15.6.17** | గురు | బ॥ షష్ఠి | శతతార | మకరం | రా. 09-39 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **15.6.17** | గురు | బ॥ షష్ఠి | శతతార | మేషం | రా.తె.3-06 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **18.6.17** | ఆది | బ॥ నవమి | ఉ॥భాద్ర | కర్కాటకం | ఉ. 08-12 | పక్షమార్తా | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. |
| **18.6.17** | ఆది | బ॥ నవమి | రేవతి | మకరం | రా. 09-27 | పక్షమార్తా | పుష్కర | వివాహం. |
| **18.6.17** | ఆది | బ॥ నవమి | రేవతి | మీనం | రా. 12-27 | ధృవక | పుష్కర | వివాహం. |
| **18.6.17** | ఆది | బ॥ నవమి | రేవతి | మేషం | రా. 02-54 | పక్షమార్తా | పుష్కర | వివాహం. |
| **19.6.17** | సోమ | బ॥ దశమి | రేవతి | కర్కాటకం | ఉ. 08-07 | పక్షక | పుష్కర | గృహారంభం, ప్రతిష్ఠ. |
| **19.6.17** | సోమ | బ॥ దశమి | అశ్విని | మకరం | రా. 09-22 | పక్షక | పుష్కర | శుభాదులు. |



www.granthanidhi.blogspot.in

**25-06-2017 ఆదివారం నుండి 23-07-2017 ఆదివారం వరకు ఆషాఢమాసం శుభముహూర్తములు లేవు.**

## శ్రావణ మాసం 24-07-2017 సోమ నుండి 21-08-2017 సోమ వరకు

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **27.7.17** | గురు | శు॥ పంచమి | ఉత్తర | మీనం | రా. 09-57 | పంచక | పుష్కర | గృహప్రవేశం. |
| **27.7.17** | గురు | శు॥ పంచమి | ఉత్తర | మేషం | రా. 12-23 | పంచక | పుష్కర | వివాహం. |
| **27.7.17** | గురు | శు॥ పంచమి | హస్త | మిధునం | రా.తె.4-59 | మార్తాండ | వర్గో | వివాహం, గృహారంభం. |
| **28.7.17** | శుక్ర | శు॥ షష్ఠి | హస్త | కన్య | ఉ. 10-24 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **28.7.17** | శుక్ర | శు॥ షష్ఠి | హస్త | మీనం | రా. 09-53 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **28.7.17** | శుక్ర | శు॥ షష్ఠి | హస్త | మేషం | రా. 12-19 | ధృవక | పుష్కర | వివాహం. |
| **28.7.17** | శుక్ర | శు॥ షష్ఠి | హస్త | మిధునం | రా.తె.4-37 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం. |
| **29.7.17** | శని | శు॥ సప్తమి | చిత్త | సింహం | ఉ. 08-43 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **29.7.17** | శని | శు॥ సప్తమి | చిత్త | కన్య | ఉ. 10-20 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **29.7.17** | శని | శు॥ సప్తమి | చిత్త | మీనం | రా. 09-49 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **29.7.17** | శని | శు॥ సప్తమి | చిత్త | మేషం | రా. 12-15 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **29.7.17** | శని | శు॥ సప్తమి | చిత్త | మిధునం | రా.తె.4-33 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **30.7.17** | ఆది | శు॥ అష్టమి | స్వాతి | కన్య | ఉ. 10-16 | పంచక | పుష్కర | వివాహం. |
| **30.7.17** | ఆది | శు॥ అష్టమి | స్వాతి | మీనం | రా. 09-45 | పంచక | పుష్కర | వివాహం. |
| **30.7.17** | ఆది | శు॥ అష్టమి | స్వాతి | మిధునం | రా.తె.4-29 | పంచక | పుష్కర | వివాహం. |
| **01.8.17** | మంగ | శు॥ దశమి | అనూరాధ | మిధునం | రా.తె.4-22 | మార్తాండ | పుష్కర | శుభాదులు. |
| **02.8.17** | బుధ | శు॥ దశమి | అనూరాధ | సింహం | ఉ. 08-28 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **02.8.17** | బుధ | శు॥ దశమి | అనూరాధ | కన్య | ఉ. 10-05 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం. |
| **03.8.17** | గురు | శు॥ ద్వాదశి | మూల | మీనం | రా. 09-29 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **03.8.17** | గురు | శు॥ ద్వాదశి | మూల | మేషం | రా. 11-55 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **03.8.17** | గురు | శు॥ ద్వాదశి | మూల | మిధునం | రా.తె.4-13 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **04.8.17** | శుక్ర | శు॥ ద్వాదశి | మూల | సింహం | ఉ. 07-53 | మార్తాండ | వర్గో | శుభాదులు. |



www.granthanidhi.blogspot.in

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **04.8.17** | శుక్ర | శు॥ ద్వాదశి | మూల | కన్య | ఉ. 10-56 | పంచక | వర్గో | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **09.8.17** | బుధ | బ॥ విదియ | శతతార | సింహం | ఉ. 08-01 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **09.8.17** | బుధ | బ॥ విదియ | శతతార | కన్య | ఉ. 09-38 | పక్షమార్తా | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **09.8.17** | బుధ | బ॥ విదియ | శతతార | మీనం | రా. 09-07 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **09.8.17** | బుధ | బ॥ విదియ | శతతార | మేషం | రా. 11-33 | ధృవక | పుష్కర | వివాహం. |
| **09.8.17** | బుధ | బ॥ తదియ | శతతార | మిధునం | రా.తె. 3-51 | పక్షమార్తా | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **11.8.17** | శుక్ర | బ॥ చవితి | ఉ॥భాద్ర | సింహం | ఉ. 07-52 | పక్షమార్తా | పుష్కర | శుభాదులు. |
| **11.8.17** | శుక్ర | బ॥ చవితి | ఉ॥భాద్ర | కన్య | ఉ. 10-29 | పంచక | వర్గో | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **11.8.17** | శుక్ర | బ॥ చవితి | ఉ॥భాద్ర | తుల | ఉ. 10-44 | పంచక | వర్గో | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **11.8.17** | శుక్ర | బ॥ చవితి | ఉ॥భాద్ర | మీనం | రా. 08-59 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **11.8.17** | శుక్ర | బ॥ చవితి | ఉ॥భాద్ర | మేషం | రా. 11-25 | పంచక | పుష్కర | వివాహం. |
| **11.8.17** | శుక్ర | బ॥ పంచమి | ఉ॥భాద్ర | మిధునం | రా.తె. 3-43 | పక్షమార్తా | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **12.8.17** | శని | బ॥ పంచమి | రేవతి | కన్య | ఉ. 09-25 | పక్షక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **12.8.17** | శని | బ॥ పంచమి | రేవతి | తుల | ఉ. 10-40 | పంచక | వర్గో | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **12.8.17** | శని | బ॥ పంచమి | రేవతి | మీనం | రా. 08-55 | పంచక | పుష్కర | గృహప్రవేశం, శుభాదులు. |
| **12.8.17** | శని | బ॥ షష్ఠి | రేవతి | మేషం | రా. 11-21 | పక్షక | పుష్కర | వివాహం. |
| **12.8.17** | శని | బ॥ షష్ఠి | రేవతి | మిధునం | రా.తె. 3-39 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం. |
| **13.8.17** | ఆది | బ॥ షష్ఠి | అశ్విని | కన్య | ఉ. 09-20 | పక్షక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **13.8.17** | ఆది | బ॥ షష్ఠి | అశ్విని | మీనం | రా. 08-50 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **13.8.17** | ఆది | బ॥ సప్తమి | అశ్విని | మేషం | రా. 11-16 | పంచక | పుష్కర | వివాహం. |
| **16.8.17** | బుధ | బ॥ నవమి | రోహిణి | కన్య | ఉ. 09-09 | పక్షక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ, శుభాదులు. |
| **16.8.17** | బుధ | బ॥ దశమి | రోహిణి | మీనం | రా. 08-39 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **16.8.17** | బుధ | బ॥ దశమి | మృగశిర | మిధునం | రా.తె. 3-23 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **17.8.17** | గురు | బ॥ దశమి | మృగశిర | కన్య | ఉ. 09-05 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, ప్రతిష్ఠ. |
| **17.8.17** | గురు | బ॥ ఏకాదశి | మృగశిర | మీనం | రా. 08-34 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |



www.granthanidhi.blogspot.in

22-08-2017 మంగళవారం నుండి 20-09-2017 బుధవారం వరకు భాద్రమాసం. శుభముహూర్తములు లేవు.

## ఆశ్వీయుజ మాసం 21-09-2017 గురు నుండి 19-10-2017 గురు వరకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| **21.9.17** | గురు | శు॥ పాడ్యమి | హస్త | తుల | ఉ. 09-39 | ----- | పుష్కర | శుభాదులు. |
| **21.9.17** | గురు | శు॥ విదియ | హస్త | మేషం | రా. 08-42 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **21.9.17** | గురు | శు॥ విదియ | చిత్త | మిధునం | రా. 01-00 | ధృవక | పుష్కర | వివాహం. |
| **22.9.17** | శుక్ర | శు॥ తదియ | చిత్త | మేషం | రా. 08-38 | మార్తాండ | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **22.9.17** | శుక్ర | శు॥ తదియ | స్వాతి | మిధునం | రా. 12-56 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **22.9.17** | శుక్ర | శు॥ తదియ | స్వాతి | కర్కాటక | రా. 01-53 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **23.9.17** | శని | శు॥ తదియ | స్వాతి | తుల | ఉ. 09-31 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **23.9.17** | శని | శు॥ చవితి | స్వాతి | మేషం | రా. 08-34 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **23.9.17** | శని | శు॥ చవితి | స్వాతి | మిధునం | రా. 12-52 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **25.9.17** | సోమ | శు॥ పంచమి | అనూరాధ | తుల | ఉ. 07-46 | ధృవక | వర్గో | శుభాదులు. |
| **27.9.17** | బుధ | శు॥ అష్టమి | మూల | మేషం | రా. 08-18 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **27.9.17** | బుధ | శు॥ అష్టమి | మూల | మిధునం | రా. 12-56 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **28.9.17** | గురు | శు॥ అష్టమి | మూల | తుల | ఉ. 09-11 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **30.9.17** | శని | శు॥ దశమి | ఉ॥షా॥ | తుల | ఉ. 09-03 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **30.9.17** | శని | శు॥ దశమి | శ్రవణం | మేషం | రా. 08-06 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **1.10.17** | ఆది | శు॥ ఏకాదశి | శ్రవణం | తుల | ఉ. 09-00 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **1.10.17** | ఆది | శు॥ ఏకాదశి | శ్రవణం | మేషం | రా. 08-03 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **1.10.17** | ఆది | శు॥ ఏకాదశి | ధనిష్ఠ | మిధునం | రా. 10-42 | ధృవక | శుభ | వివాహం, శుభాదులు. |
| **2.10.17** | సోమ | శు॥ ద్వాదశి | ధనిష్ఠ | తుల | ఉ. 08-56 | మార్తాండ | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **4.10.17** | బుధ | శు॥ చతుర్దశి | ఉ॥భాద్ర | మిధునం | రా. 12-17 | మార్తాండ | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **5.10.17** | గురు | శు॥ పౌర్ణిమ | ఉ॥భాద్ర | తుల | ఉ. 09-04 | మార్తాండ | శుభ | వివాహం, శుభాదులు. |
| **5.10.17** | గురు | శు॥ పౌర్ణిమ | ఉ॥భాద్ర | మేషం | రా. 07-47 | ----- | పుష్కర | శుభాదులు. |
| **5.10.17** | గురు | శు॥ పౌర్ణిమ | రేవతి | మిధునం | రా. 12-05 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **6.10.17** | శుక్ర | బ॥ పాడ్యమి | అశ్విని | మేషం | రా. 07-42 | పక్షక | పుష్కర | శుభాదులు. |
| **6.10.17** | శుక్ర | బ॥ విదియ | అశ్విని | మిధునం | రా. 12-00 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |
| **7.10.17** | శని | బ॥ విదియ | అశ్విని | తుల | ఉ. 08-35 | పంచక | పుష్కర | వివాహం, శుభాదులు. |



www.granthanidhi.blogspot.in

**12-10-2017 గురువారం నుండి 09-11-2017 గురువారం వరకు గురుమౌఢ్యమి. శుభముహూర్తములు లేవు.**

## మార్గశిర మాసం 19-11-2017 ఆది నుండి 18-12-2017 సోమ వరకు

| తేది | వారం | తిథి | నక్షత్రం | లగ్నం | సమయం | పంచక | అంశ | వివరములు |
|---|---|---|---|---|---|---|---|---|
| **23.11.17** | గురు | శు॥ పంచమి | ఉ॥షా॥ | మకరం | ఉ. 11-09 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **23.11.17** | గురు | శు॥ పంచమి | ఉ॥షా॥ | సింహం | రా. 01-00 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **23.11.17** | గురు | శు॥ పంచమి | ఉ॥షా॥ | తుల | రా.తె. 5-29 | ధృవక | పుష్కర | వివాహం, గృహారంభం. |
| **24.11.17** | శుక్ర | శు॥ షష్ఠి | శ్రవణం | మకరం | ఉ. 11-04 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **24.11.17** | శుక్ర | శు॥ షష్ఠి | శ్రవణం | సింహం | రా. 12-55 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **24.11.17** | శుక్ర | శు॥ షష్ఠి | శ్రవణం | తుల | రా.తె. 5-24 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **25.11.17** | శని | శు॥ సప్తమి | శ్రవణం | మకరం | ఉ. 10-59 | మార్తాండ | పుష్కర | శుభాదులు. |
| **25.11.17** | శని | శు॥ సప్తమి | ధనిష్ఠ | సింహం | రా. 12-50 | ధృవక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **25.11.17** | శని | శు॥ సప్తమి | ధనిష్ఠ | తుల | రా.తె. 5-19 | మా.ధృవ | పుష్కర | వివాహం, గృహారంభం. |
| **26.11.17** | ఆది | శు॥ అష్టమి | ధనిష్ఠ | మకరం | ఉ. 10-56 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **26.11.17** | ఆది | శు॥ అష్టమి | శతతార | సింహం | రా. 12-47 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **26.11.17** | ఆది | శు॥ అష్టమి | శతతార | తుల | రా.తె. 5-16 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **27.11.17** | సోమ | శు॥ అష్టమి | శతతార | మకరం | ఉ. 10-51 | ధృవక | పుష్కర | శుభాదులు. |

**28-11-2017 మంగళవారం నుండి 19-02-2018 సోమవారం వరకు శుక్రమౌఢ్యమి. శుభముహూర్తములు లేవు.**

ధీ ప్రద్యుమ్నమయీ మథాపి నితరాం ప్రద్యుమ్న సంసేవితాం । అవ్యక్తాది మథాపి వేంకటపతే స్సౌందర్య సంభావితాం ।
దేవీముత్తర శైలజామపి సదా శ్రీదక్షిణాస్యానుగాం । కాలాత్మనమథాపి కాలశమనీం శ్రీ త్రైపురీం భావయే ॥
శ్రీవేంకటాద్రి నిలయః కమలాకాముకః పుమాన్ । అభంగుర విభూతిర్నస్తరంఙ్గయతు మంగళం ॥

www.granthanidhi.blogspot.in

## ఫాల్గుణ మాసం 16-02-2018 శుక్ర నుండి 17-03-2018 శని వరకు

| | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|
| **21.2.18** | బుధ | శు॥ షష్ఠి | అశ్విని | కుంభం | ఉ. 07-31 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. |
| **21.2.18** | బుధ | శు॥ షష్ఠి | అశ్విని | మీనం | ఉ. 08-14 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. |
| **23.2.18** | శుక్ర | శు॥ అష్టమి | రోహిణి | కన్య | రా. 08-35 | ధృవక | పుష్కర | వివాహం. |
| **23.2.18** | శుక్ర | శు॥ అష్టమి | రోహిణి | తుల | రా. 11-27 | పంచక | పుష్కర | వివాహం. |
| **24.2.18** | శని | శు॥ నవమి | రోహిణి | మీనం | ఉ. 08-02 | పంచక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. |
| **24.2.18** | శని | శు॥ నవమి | రోహిణి | మేషం | ఉ. 10-29 | పంచక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. |
| **24.2.18** | శని | శు॥ నవమి | మృగశిర | కన్య | రా. 08-31 | పంచక | పుష్కర | వివాహం. |
| **24.2.18** | శని | శు॥ దశమి | మృగశిర | తుల | రా. 11-23 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **25.2.18** | ఆది | శు॥ దశమి | మృగశిర | కుంభం | ఉ. 07-15 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. |
| **25.2.18** | ఆది | శు॥ దశమి | మృగశిర | మీనం | ఉ. 07-58 | మార్తాండ | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. |
| **26.2.18** | సోమ | శు॥ ఏకాదశి | పునర్వసు | మేషం | ఉ. 10-21 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **02.3.18** | శుక్ర | బ॥ పాడ్యమి | ఉత్తర | తుల | రా. 10-59 | పంచక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **03.3.18** | శని | బ॥ విదియ | ఉత్తర | మేషం | ఉ. 10-00 | ధృవక | పుష్కర | శుభాదులు. |
| **03.3.18** | శని | బ॥ విదియ | ఉత్తర | కన్య | రా. 08-02 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **03.3.18** | శని | బ॥ విదియ | హస్త | తుల | రా. 10-54 | మార్తాండ | పుష్కర | వివాహం. |
| **04.3.18** | ఆది | బ॥ తదియ | హస్త | మీనం | ఉ. 07-29 | పక్షధృవక | పుష్కర | వివాహం, ఉపనయనం, ప్రతిష్ఠ. |
| **04.3.18** | ఆది | బ॥ తదియ | హస్త | మేషం | ఉ. 09-56 | పక్షక | పుష్కర | వివాహం, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **04.3.18** | ఆది | బ॥ తదియ | హస్త | కన్య | రా. 07-58 | పక్షక | పుష్కర | వివాహం. |
| **04.3.18** | ఆది | బ॥ తదియ | చిత్త | తుల | రా. 10-50 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |
| **05.3.18** | సోమ | బ॥ చవితి | చిత్త | మీనం | ఉ. 07-25 | పక్షక | పుష్కర | గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. శుభాదులు. |
| **05.3.18** | సోమ | బ॥ చవితి | చిత్త | మేషం | ఉ. 09-52 | పంచక | పుష్కర | ప్రతిష్ఠ, శుభాదులు. |
| **05.3.18** | సోమ | బ॥ చవితి | చిత్త | కన్య | రా. 07-54 | పంచక | పుష్కర | శుభాదులు. |
| **08.3.18** | గురు | బ॥ సప్తమి | అనూరాధ | మీనం | ఉ. 07-13 | పక్షక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ఉపనయన, ప్రతిష్ఠ. |
| **08.3.18** | గురు | బ॥ సప్తమి | అనూరాధ | మేషం | ఉ. 09-40 | పంచక | పుష్కర | వివాహం, గృహారంభం, గృహప్రవేశం, ప్రతిష్ఠ. |
| **08.3.18** | గురు | బ॥ సప్తమి | అనూరాధ | తుల | రా. 10-34 | పక్షక | పుష్కర | వివాహం, గృహప్రవేశం. |

సర్వం శ్రీమాతృ చరణార విందార్పణమస్తు

విద్వత్కృపాభిలాషి **దైవజ్ఞ లక్కావఝ్ఝుల సుబ్రహ్మణ్య సిద్ధాన్తి**
9963732303, 9866839560, 9550017546



www.granthanidhi.blogspot.in

**కాల మహిమ**

శ్లో॥ ద్విఘటీ ప్రమితం తత్ర ముహూర్తం కథితం బుధైః ।
షడ్భిః ప్రాణైర్వినాడిస్యాత్ తద్దశా క్షణికా స్మృతా ॥

మనం చేసే ప్రతీ పనిలో కొంత ఆలస్యమైతేనో లేకపోతే లేదా తొందరగా వస్తానని చెప్పడానికో ఇదిగో క్షణం లో పూర్తి చేస్తాను. క్షణం లో వస్తాను. క్షణంలో వెళ్తాను ఇలాంటి మాటలు సహజంగా మాట్లాడుతూనే ఉంటాం కాని క్షణకాలం అంటే అందరం మన కాలమానం లో 1 నిమిషం అని లేదా కొద్ది సమయం అని భావన చెందుతూ ఉంటాము. మరి ఇంతకీ **క్షణకాలమంటే ఎంత? మన పూర్వులు ఏం చెప్పారు?** మన పూర్వులు మనకందించిన కాలమానం లో

| | | |
|---|---|---|
| 1 ప్రాణము (4 సెకన్లు) | – | 10 లిప్తలు (ఒక శ్వాస కాలము). |
| 6 ప్రాణములు | – | 60 లిప్తలు (ఒక విఘడియ), (24 సెకన్లు). |
| 2. 1/2 విఘడియలు | – | 1 నిమిషం |
| **10 విఘడియలు** | **–** | **4 నిమిషాలు 1క్షణ కాలం** |
| 60 విఘడియలు, 6 క్షణాలు | – | 1 ఘడియ (24 నిమిషములు). |
| **2 ఘడియలు** | **–** | **1 ముహూర్త కాలము. (48 నిమిషములు)** |
| 2. 1/2 ఘడియలు | – | 1 గంట |
| 60 ఘడియలు, 30 ముహూర్తములు | – | 1 అహోరాత్రము (24 గంటలు). |

6 ప్రాణములు 1 విఘడియగా, అటువంటి 10 విఘడియల తో సమానం మనం వాడుకలో వాడుతున్న ఒక్క క్షణ కాలం.

**1 క్షణ కాలం - 4 నిమిషములు**

**1 ముహూర్త కాలం - 48 నిమిషములు**

న్యూయార్క్, టెక్సాన్, లాస్‌ఎంజిల్స్, చికాగో, అట్లాంటికా, లండన్, మెక్సికో మొదలగు విదేశీ ప్రాంతముల హిందూ క్యాలెండర్ (విదేశీ పంచాంగము)ల కొరకు, మరియూ విదేశీ ప్రాతముల వారికి కావలసిన వివాహాది శుభముహూర్తముల కోసం సంప్రదించగలరు.
**Consult Me For ..**
**New york,Techwon,Los Angeles,Chicago,London,Mexico...etc International any Places Tithi, Nakshatra,Varjya, Marriages & all the Good Timings**
**AP ENDOWMENTS AGAMA ADVISOR, KANCHI PETHA ASTHANA SIDDHANTHI**
**"Jyothisha kesari" "jyothisha chaturanana" "daivagna shiroratna"**
**Brahma Sri.DAIVAGNA SUBRAHMANYA SIDDHANTHY**
**e-mail:** lssiddhanthy@gmail.com, lssiddhanthy.blogspot.com
**9963732303, 9550017546, 9866839560**.

www.granthanidhi.blogspot.in



# మేష రాశి

## ARIES

| | |
|---|---|
| ఆదాయం - 08 | వ్యయం - 14 |
| రాజ్యపూజ్యం - 04 | అవమానం - 03 |

**అశ్వని, భరణి, కృత్తిక 1 వ పాదాలలో జన్మించినవారు.**

**చూ,చే,చో,ల,లీ,లూ,లే,లో,అ అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**మేష రాశి వారి లక్షణములు :**

వీరు సామాన్య శరీర ధారుఢ్యం, పొడవైన మెడ, గుండ్రని యెర్రని కళ్ళు, హస్తములో పుట్టుమచ్చలాంటి చిహ్నములు, కోల ముఖము కలిగి ఉంటారు. వేడి పదార్థములు భుజించుటయందు ఆసక్తి కలిగి అల్పాహారులై యుందురు. తీవ్రత, శక్తి, దృఢత్వం, అచంచలమైన నిశ్చయము, సాహసము, వ్యవహార దక్షత, విశ్లేషణ, నైపుణ్యత, స్వతంత్ర జీవనము నందు అభిలాష కలిగి, విద్యావంతులు, ఆరోగ్యవంతులు శౌర్యవంతులై ఉందురు. సాహసము ఆవశ్యకత ఉన్న చోట రాణింతురు. అభ్యాసము వలన శరీరశక్తి మరింత దృఢంగా ఉంటుంది. ముక్కుకు సూటిగా ఆవేశముగా ఎన్ని అడ్డంకులు వచ్చిననూ పోరాడి విజయం సాధింతురు. పదిమందిని కూడగట్టుకొని నాయకత్వం వహించుదురు. వేద శాస్త్ర సదాచారములయందు ప్రీతి కల్గి ఉందురు. నీరు,అగ్నిభయం ఎక్కువ. ప్రేమ, జాలి, దయా గుణములతో ఆకర్షించ గల నేర్పు కలిగి ఉంటారు. అహంకార పూరితమైన స్వభావము కారణంగా అపాయాలు,ఇబ్బందులు, కష్టాలు కొని తెచ్చుకుంటారు. కన్యారాశిలో జన్మించినవారు శత్రువులై వీరిని పొగిడి, రెచ్చగొట్టి పతనము చేయుదురు. బాల్యంలో కష్టాలు, చిన్న వయస్సులో ఆర్థిక ఇబ్బందులు, స్నేహితులను విడిచిపెట్టి, ఇతర ప్రాంతాలకు వెళ్ళడం, కుటుంబ పరిస్థితి మారడం జరుగును. దుడుకు స్వభావాన్ని వదిలి పెట్టలేరు. అతిస్నేహం, అతి శత్రుత్వం కలిగిన మనస్తత్వం వీరిని క్రుంగదీయును. ఏ చిన్న ఎదురు దెబ్బ తలిగినా నిరుత్సాహ పడే తత్వం. తండ్రియందు వ్యతిరేఖత తల్లి యందు అనురాగభావం, జ్యేష్ఠ సంతతి వలన కష్టములు, తోబుట్టిన వారి వలన సౌఖ్యమును కలిగి యుందురు. అబ్బాయిలు సౌందర్యం పట్ల, అలంకరణ పట్ల ఆసక్తి చూపుతారు. ప్రేమలో నూతనత్వాన్ని కాంక్షిస్తారు. కొత్త వ్యక్తి మీద ప్రేమ కలుగగానే పాతవారిని మరచిపోతారు. పొగడ్తలకు ఉబ్బి పోయెదరు. అశ్వినీ నక్షత్రమున జన్మించిన వారు అందముగా ఉందురు. అలంకార ప్రియులు. కార్యదక్షులు. భరణీ నక్షత్రం వారు సమర్థులు, సుఖవంతులు,మొండి పట్టు కలిగిన వారు. కృత్తికా నక్షత్రం వారు భోజన ప్రియులు, ఇతరుల విషయముల యందు ఆసక్తి కలవారు. తూర్పు, ఉత్తర సింహ ద్వారములు శుభప్రదం. 2,3,8,9,11లకు ఆది, మంగళ, బుధ, శనివారములు కలసిన శ్రేయోదాయకం.

### మేష రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 6,7 స్థానములలో, శని 9వ స్థానములో, రాహువు 5,4 స్థానములలో, కేతువు 11,10 స్థానములలో ఉండుట వలన

పనులలో అనేక ఆటంకములు ఉన్నప్పటికీ దైవానుగ్రహమువలన నెరవేరుట, తొందరపాటు నిర్ణయముల వలన దగ్గరివారితో మాటపట్టింపులు వచ్చుట, సోదర వర్గం వారితో విభేదములు తగ్గుముఖం పట్టుట, ఆర్థికపరమైన అంశములలో ఇతరుల వలన ఇబ్బందులు ఏర్పడుట,ఆరోగ్యపరమైన సమస్యలు తలెత్తుట, పూర్వుల ఆస్తి వివాదములు తొలగిపోవుట, ఆడంబరములకై, వైద్యసేవా నిమిత్తమై ధనవ్యయం అధికమగుట, గృహములో మార్పులు చేయుట, కళాకారులకు, యోగదాయకముగా ఉండుట, వ్యవసాయదారులకు పంటలయందు నష్టం వాటిల్లుట, ఋణములు చేయవలసి వచ్చుట, విద్యార్థులకు శ్రమచేత ఉన్నత ఫలితములు, ఉన్నత ఉద్యోగ అవకాశములు చేకూరుట, ఉద్యోగస్థులకు అధికారుల వత్తిడి అధికమగుట, వ్యాపారస్తులకు మిశ్రమ ఫలితములేర్పడుట, రాజకీయవర్గం వారికి ప్రజలలో వ్యతిరేఖత పెరుగుట, పై అధికారులతో విభేదములు ఏర్పడుట, ధనసంబంధమైన ఇబ్బందులు ఏర్పడుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు గణపతి హోమములు, దుర్గాద్వాత్రిశన్నామావళి, లక్ష్మీ హృదయ పారాయణములు, ఆకుపచ్చ వస్త్రములను దానముచేయుట, మారేడు వృక్షములకు నీళ్లుపోయుట** వలన శుభములు చేకూరును.

www.granthanidhi.blogspot.in

**ఏప్రియల్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం మానసిక ఒత్తిడి తగ్గించు కొనుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట, కుటుంబ వ్యక్తులతో మాటపట్టింపులు తగ్గుముఖం పట్టుట, నిర్మాణాది పనులకై ఆలోచించుట, మిత్రుల సహకారము తీసుకొనుట జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం బంధువర్గం నుండి శుభవార్తలు వినుట, ఆడంబరములకై ధనవ్యయము అధికమగుట, వృత్తివ్యాపారాదులలో ఆటంకములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, శుభకార్యక్రమములలో స్వల్ప వివాదములేర్పడుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చాలాకాలంగా ఆగిపోయిన పనులను నూతన ఉత్తేజముతో ప్రారంభించుట, సంఘములో గౌరవ మర్యాదలకై తీవ్రంగా శ్రమించుట, శ్రమకుతగిన గుర్తింపులు రాకపోవుట, అకాల భోజనములు, నిద్రలేమితనముల వలన ఇబ్బందులు పడుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసి వచ్చుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆదాయమును మించి ఖర్చులు అధికమగుట, నిర్మాణాది పనులు సజావుగా సాగుట, సమయానికి ధనము ఏదోరకముగా చేతికందుట, బంధువర్గం వారితో స్వల్ప వివాదములు వచ్చి మరల తగ్గిపోవుట, పాతమిత్రులను కలుసుకొనుట, పొత్తువ్యాపారములు లాభించుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఇతరులను మెప్పించుటకై తలవొగ్గి పనులను చేయవలసి వచ్చుట, అధికారుల మన్ననలకై తీవ్ర ప్రయత్నములు చేయుట, సన్నిహితుల సహకారముతో కుటుంబ వ్యక్తుల సహకారముతో నూతన ప్రయత్నములు లాభించుట, ఎక్కడ తప్పుదొరుకుతుందా అని ఎదుటివారు గమనించుట జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సకాలములో ఋణములు లభించుట, శుభకార్యక్రమములను నిర్వహించుటకు ఒప్పందములు తీసుకొనుట, ఇతరుల బాధ్యతలను స్వీకరించుట, తొందరపాటు నిర్ణయాలవలన ప్రారంభములో ఇబ్బందులు వచ్చిననూ అనుకూల వాతావరణములు ఏర్పడుట, దైవకార్యక్రమాదులలో పాల్గొనుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబవ్యక్తులకు గౌరవ పురస్కారములు లభించుట, స్త్రీమూలక ధనవ్యయములు అధికమగుట, ఒంటరి జీవనము గడపవలసి వచ్చుట, వైద్యసేవ తప్పనిసరి అగుట, మిత్రుల సహకారముతో పనులు పూర్తియగుట, నూతన ప్రయత్నములు, పెట్టుబడులు లాభించుట, వస్తులాభములు ఏర్పడుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆరోగ్య భంగములు ఏర్పడుట, అయిష్ట బదలీలు జరుగుట, అనవసరపు ఖర్చులు అధికమగుట, కీలక నిర్ణయములు సరియైన సమయములో తీసుకోవుట వలన శుభములు పొందుట, కడుపు, కీళ్ళకు సంబంధించిన ఇబ్బందులు వాటిల్లుట, వాహనపరమైన ఒడిదుడుకులు ఏర్పడుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన గృహోపకరణములు కొనుగోలు చేయుట, గృహముయందు మార్పులు చేయుట, వివాదాలను తగ్గించుకొనుటకు చేయు ప్రయత్నములు సఫలమగుట, ప్రముఖుల మన్ననలు పొందుట, పాతమిత్రులతో కలసి చేయు ప్రయాణాదులలో లాభములు ఏర్పడుట, ఆకస్మిక ధనలాభములేర్పడుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం పనిభారము అధికమగుట, సంకల్పించిన పనులు పూర్తిచేసి అధికారుల మన్ననలుపొందుటకు తీవ్ర ప్రయత్నములు చేయుట, ఆధ్యాత్మిక వాతావరణములో గడుపుట, ప్రముఖులను కలుసుకొనుట, అంతఃశత్రువులను తెలుసుకొని తగుజాగ్రత్తలు పడుట, ఋణప్రయత్నములు సఫలమగుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నిర్మాణాది శుభకార్యక్రమ పనులు ఒకకొలిక్కి వచ్చుట, చాలాకాలంగా ఇబ్బందిపెడుతున్న మనస్పర్ధలు మాటపట్టింపులు తగ్గుముఖం పట్టుట, అందరినీ స్నేహభావముతో కలుపుకొనిపోవుట, కుటుంబవ్యక్తులతో కలసి దూరప్రాంత ప్రయాణములు చేయుట, వ్యాపార చర్చలు వాయిదాపడుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమ, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, ఇతరుల కార్యక్రమములలో ముఖ్యపాత్ర వహించుట, తెలియకుండానే నీచులతో సఖ్యత ఏర్పడుట, తద్వారా సన్నిహితులు దూరమగుట, స్వల్ప విషయములకే కోపతాపములు అధికమగుట, శారీరక శ్రమ, పనిఒత్తిడి అధికమగుట, వైద్యసేవ చేయవలసి వచ్చుట జరుగును.

www.granthanidhi.blogspot.in



# వృషభ రాశి

## TAURUS

ఆదాయం - ౦౨
వ్యయం - ౦౮
రాజ్యపూజ్యం - 07
అవమానం - 03

**కృత్తిక 2,3,4, రోహిణి 1,2,3,4, మృగశిర 1,2 పాదాలలో జన్మించినవారు.**
**ఇ.ఉ.ఏ.ఓ.వ.వి.వు.వే.వో అను అక్షరములతో ప్రారంభమగు పేర్లు గలవారు**

**వృషభ రాశి వారి లక్షణములు :**

వీరిది పుష్టిగల శరీరం, గుండ్రని ముఖము, పొట్టి మెడ, తొడలు, పృష్టము విశాలముగా నుండును. ముఖము మీద గాని,వృష్టము మీదగాని,పార్శ్వ భాగమున గానీ పుట్టమచ్చ ఉండును.మూపురముండును.శరీరశిక్షణ, ఫుట్‌బాల్ వంటి ఆటలు ఆరోగ్యమును పెంచును. స్థిరత్వము, ఆనందము, వాత్సల్యము, దృఢత్వము, పెదవులపై చిరునవ్వు, నిజాయితీ, ఆప్యాయత, మంచి మనస్సు ఉండును. సంగీత సాహిత్యా భిలాషులు. వీరిలోని నిష్కల్మషమైన గుణము, మంచితనము, నమ్మకము కలిగించె స్వభావము ఎదుటివారిని ఆకర్షిస్తాయి. ఉన్నతాధికారులుగా నియమించినచో చక్కగా పనులు చేయింపగలరు. మధ్య వయస్సులోనూ, వృద్ధాప్యంలోనూ సుఖపడుదురు. ఎదుటివారిని ఆకర్షించగల శక్తిఎక్కువ. తండ్రిగానీ, తాతగానీ, అత్యంత ప్రతిభావంతులై ఉంటారు. పూర్వ బంధువులుందురు. వీరి వలన కుటుంబమునకు మంచిపేరు,ప్రతిష్ఠలు వస్తాయి. వ్యాపారంలో భాగస్వామ్యం పనికిరాదు.స్త్రీ ప్రియులు.ప్రేమ వ్యవహారాలలో చిక్కుకున్నచో, ఎదుటి వ్యక్తి చేతిలో కీలు బొమ్మ కాగలరు. ఒక యువతి చేత ఒకసారి ప్రభావితులైతే శక్తులన్నియూ వ్యర్థమై పోవును. చిన్న వయస్సులో వివాహమాడుట గానీ, ప్రేమ కలాపము గానీ, ఏదైనను మొదటి ప్రయత్నము విఫలమగును. 30ఏళ్ళ తర్వాత వివాహమాడినచో వైవాహిక జీవితం ఆనందమయమగును.ఈ రాశి స్త్రీలు బహు రూపవతులు. కళాత్మక దృష్టితో చిత్రములు, గృహోపకరణములు కంటికింపుగా ఏర్పాటు చేయుదురు.రుచిగల మధుర పదార్థములు తయారు చేయగలరు.విలాసముల కొరకు ఖర్చు చేయుదురు.పుత్రులు, పుత్రికలు కలిగి దీర్ఘాయుర్దాయము కలవారగుదురు. అబ్బాయిలకు-ప్రేమ వ్యవహారాల్లో నిజాయితీ కాస్తంత ఉధృతంగా ఉంటుంది. గుడ్డిగా ప్రేమిస్తారు.ప్రేమ,అభిమానాల విషయంలో ఎదురుదెబ్బ తగిలితే జీవితంలో కోలుకోలేరు. మనస్ఫూర్తిగా చేసే పొగడ్తలు అంటే ఇష్టం. కృత్తిక నక్షత్రం వారు భోజన ప్రియులు. తేజస్సు, ఇతరుల యందు ఆసక్తి కలిగి ప్రఖ్యాతి చెందుతారు. రోహిణి నక్షత్రము వారు స్థిరచిత్తులు, మధుర సత్యభాషణులు, శుచి కలిగి అందముగా నుందురు. మృగశిర నక్షత్రం వారు ఉత్సాహం, ధనము, భోగము కలిగి బాగా మాట్లాడుదురు. భయపడు స్వభావ ముండును.చపల చిత్తులు కానీ సమర్థులు. వీరి అదృష్ట సంఖ్య 1,2,5,6,9, శని, బుధ, శుక్ర, సోమవారములు కలసిన యోగించును.

## వృషభ రాశి వారి సంవత్సర ఫలితాంశము

ఈ సంవత్సరము ఈ రాశివారికి గురువు 5,6 స్థానములలో, శని 8వ స్థానములో, రాహువు 4,3 స్థానములలో, కేతువు 10,9 స్థానములలో ఉండుట వలన

నూతన ప్రణాలికలు ప్రారంభించుట, నూతన వ్యక్తుల పరిచయములు ఏర్పడుట, సోదర బంధు వర్గం వారి సహకారములు లభించుట, శుభమూలక ధనవ్యయములు అధికమగుట, పనులలో ఆలస్యమైననూ విజయవంతముగా పూర్తియగుట, ఆర్థికపరమైన అభివృద్ధి ఉన్ననూ ఏదోరకముగా ధనవ్యయము అధికమగుట, సంతానపరమైన అభివృద్ధి ఏర్పడుట, పదిమందిలో మంచి గుర్తింపులు వచ్చుట, గృహమునందు శుభకార్యక్రమాలు జరుగుట, గౌరవ సన్మానములు జరుగుట, మధ్యవర్తిత్వ వ్యవహారములలో ఇబ్బందులు ఏర్పడుట, ఆకస్మిక ప్రయాణములు అధికమగుట, ఏది మాట్లాడిననూ ఇతరులకు తప్పుగా అర్థమగుట, వ్యాపారాలలో ఇతరుల సహకారముతో శుభఫలితములు ఏర్పడుట, విద్యార్థులకు మంచి గుర్తింపులు వచ్చి ఉన్నత స్థితికి వెళ్లుట, వ్యవసాయ దారులకు రెండు పంటలూ లాభించుట, ఉద్యోగస్థులకు అధికారుల ఒత్తిడి తగ్గి అనుకూల వాతావరణమేర్పడుట, వైవాహిక ప్రయత్నములు సఫలమగుట, రాజకీయ వర్గం వారికి అనుకోని శుభములు కలుగుట జరుగును. ఈ సంవత్సరము **ఈ రాశివారు సుందరాకాండ, మన్యుకల్ప పారాయణములు, అరటి పండ్లు, గంధం, తమలపాకులు, అన్నదానములు, కోతులకు ఆహారమందించుట** వలన శుభములు చేకూరును.

**ఏప్రియల్ :** ఈ నెల ఫలితానుసారం చేయు వృత్తి వ్యాపారాదులయందు పోటీతత్వములు అధికమగుట, ఆశించిన లాభములు నెమ్మదిగా వచ్చుట, ఆకస్మిక స్థానచలనములు జరుగుట, శుభకార్యక్రమ ప్రయత్నములు ప్రారంభించుట, వస్తులాభములు జరుగును.
**మే :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం కుటుంబ వ్యక్తులకు ఆరోగ్యపరమైన ఇబ్బందులు ఏర్పడుట, వైద్య నిమిత్తమై ధనవ్యయము అధికమగుట, శారీరక శ్రమ అధికమగుట, అత్యవసర వ్యవహారములకై ఋణప్రయత్నములు చేయవలసి వచ్చుట జరుగును.
**జూన్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం అనవసరపు మాటల వలన ఇతరులతో ఇబ్బందులు ఏర్పడుట, ఋణప్రయత్నములు మరలా మరల జరుగుట, అంతఃశత్రువులు అధికమగుట, నూతన ప్రయత్నములు సఫలమగుట, కీలక నిర్ణయములు వాయిదాపడుట, ఆకస్మిక ప్రయాణములు చేయవలసివచ్చుట, దైవకార్యక్రమాలలో పాల్గొనుట జరుగును.
**జూలై :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థికముగా అభివృద్ధి ఉన్ననూ ఖర్చులు అధికంగా ఉండటము వలన అంతకుఅంతే సరిపోవుట, సోదరవర్గం వారితో మనస్పర్థలు ఏర్పడుట, అనవసర విమర్శలు అధికమగుట, పొత్తువ్యాపారులతో చర్చలు వాయిదాపడుట, ఆరోగ్యపరమైన జాగ్రత్తలు తీసుకోకపోవడము వలన ఇబ్బందులు పడుట జరుగును.
**ఆగస్టు :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమములు సఫలమగుట, సోదరవర్గం వారితో ఇబ్బందులు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, బంధుమిత్రులను కలుసుకొనుట, ప్రభుత్వాధికారులతో సఖ్యత కుదురుట, ఆడంబరములకై ధనవ్యయము అధికమగుట, ఇతరుల ఏడ్పు తెలియకుండానే ఇబ్బందిపెట్టుట, వస్తులాభములు జరుగును.
**సెప్టెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం నూతన వస్తువాహనాదులను కొనుగోలు చేయుట, వైద్యసేవ తప్పనిసరి అగుట, పాతమిత్రులతో కలసి చేయుప్రయత్నములు సఫలము అగుట, సొంతవర్గం వారి ఈర్ష్యాసుయలు అధికమగుట, ప్రముఖులను కలుసుకొనుట, అనవసరపు ప్రయాణములు అధికమగుట, పనివారిపై అసహనము ఏర్పడుట జరుగును.
**అక్టోబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆర్థిక అభివృద్ధికై చేయు ప్రయత్నములు లాభించుట, కుటుంబ వ్యవహారములకై స్త్రీమూలక ధనవ్యయము అధికమగుట, తెలియకుండానే చెడుకార్యక్రమములకు సహకారము అందించుట, వాహన నిమిత్తమై ధనవ్యయములు ఏర్పడుట, ఆకస్మిక పురస్కారములు లభించుట, కీర్తి వృద్ధియగుట జరుగును.
**నవంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం చాలాకాలంగా ఇబ్బందిపెడుతున్న సమస్యలు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, నిర్మాణాదిపనులను ప్రారంభించుట, ఆర్థిక ఒడిదుడుకులు అలాగే ఉండుట, స్థిరాస్తుల విషయములలో ఇబ్బందులు వాటిల్లుట, ఇతరుల కార్యక్రమములకు పెద్దరికం చెలాయించుట, సహకారములు అందించుట జరుగును.
**డిసెంబర్ :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం శుభకార్యక్రమ ప్రయత్నములు సఫలమగుట, చేయువృత్తివ్యాపారాదులయందు లాభములు ఏర్పడుట, వాహనపరమైన ఇబ్బందులు తలెత్తుట, కుటుంబవ్యక్తులతో స్వల్ప విషయములకే విభేదములు వచ్చుట, కోపతాపములు అధికమగుట, నూతన కార్యక్రమాలను ప్రారంభించుట జరుగును.
**జనవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం సోదరవర్గం వారి ఈర్ష్యాసుయలు అధికమగుట, దూరప్రయాణములు చేయవలసి వచ్చుట, అకాల భోజనములు, నిద్రలేమితనము వలన ఆరోగ్య భంగములు ఏర్పడుట, ముఖ్యమైన నిర్ణయములు వాయిదా పడుట, ఎన్ని వ్యతిరేఖతలు ఉన్ననూ, అన్నిటిని పూర్తిగా తొలగించుకొనుట జరుగును.
**ఫిబ్రవరి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఔషదసేవ చేయవలసివచ్చుట, వివాదములు మెల్లమెల్లగా తగ్గుముఖం పట్టుట, ఋణబాధలు తొలగించుకొనుటకై చేయు ప్రయత్నములు సఫలమగుట, శుభకార్యక్రమముల వలన ఆకస్మిక ఖర్చులు ఏర్పడుట, శత్రు బాధలు తొలగి, మిత్రవృద్ధి అధికమగుట, అయాచిత సహకారములు లభించుట జరుగును.
**మార్చి :** ఈ నెలలో గ్రహస్థితి ఫలితానుసారం ఆడంబరముల వలన ఖర్చులు అధికమగుట, మానసిక ప్రశాంతతకై విహారయాత్రలకు వెళ్లుట, సోదరవర్గం వారితో విభేదములు ఏర్పడుట, జనుల ఈర్ష్యాసుయలు అధికమగుట, ఇతరులను నమ్మి మోసపోవలసి వచ్చుట, ధనము నిల్వ చేయుటకు నూతన ప్రణాళికలను సిద్ధం చేసుకొనుట, స్థానమార్పులు జరుగును.

www.granthanidhi.blogspot.in

